కశ్యప ముని ప్రణీత

# కశ్యప జాతకము

(ప్రామాణిక ద్వాదశ భావ ఫల నిర్ణయ గ్రంథము)



జ్యోతిషవిశారద - వాస్తు సమ్రాట్

డా॥ ముదుండి విశ్వనాథరాజు

శ్రీ కశ్యప ముని ప్రణీత

# కశ్యప జాతకము

( ప్రామాణిక ద్వాదశ భావఫల నిర్ణయగ్రంథము )

వ్యాఖ్యానము

జ్యోతిష విశారద, వాస్తు సమ్రాట్

**డా. ఎం.విశ్వనాథ రాజు**

భాషాప్రవీణ

ఎం.ఏ. (తెలుగు,హిందీ,సంస్కృతం,జ్యోతిషం (గోల్డ్‌మెడలిస్ట్)

ప్రకాశకులు

శ్రీ సాయి వాస్తు పబ్లికేషన్స్

హైదరాబాదు - 500052

ఫోన్ : 9440945403, 040-24017595

Sri Kasyapamuni Praneeta
Kasyapa jatakam
Translated by Dr. M. Viswanatha Raju
Sri Sai Vastu Publications

**First Edition - 1000 copies**
May : 2016
Price : 80/-

Books available at
**Dr. M. V. Raju**
*H.No. 6-3-120/6, N.P.A. Colony*
*Near Mahesh Vidya Bhavan School*
*Sivarampally, Hyderabad - 500052*
*Ph : 9440945403, 040-24017595*

ఈ గ్రంథ ముద్రణలో సహకరించిన ప్రియమిత్రులు
శ్రీ పి. గోపాలరాజు, శ్రీ ఏ. సత్యనారాయణరాజులకు
కృతజ్ఞతాపూర్వకాభినందనలు – డా. ఎం. వి. రాజు

**D.T. P:** Sri Vagdevi Grafics.Hyderabad, **Ph No :** 9490025154

*__All Visalandra Bookshops Ph : 0866 - 2430302__*
*__All Branches of Nava chetana Publishing House__*
*ph: 040 - 24602946*
***Sri Gopal Publications, Hyderabad*** *- 027.Ph : 24658101*
***Telugu Book House****, Hyd - 27, Ph No: 9247446497*
***Gandhi Book House****, Hyderabad, Ph : 9490004261*

## ముందుమాట

నారద విరచితమైన నారదసంహితలో పద్దెనిమిది మంది జ్యోతిషశాస్త్ర ప్రవర్తకులను గూర్చి తెలిపెను. వారిలో కశ్యపముని ప్రస్తావన కనపడును.

**బ్రహ్మా సూర్యో వశిష్ఠోఽత్రిర్మను: పౌలస్త్యరోమశౌ**
**మరీచిరఙ్గిరా వ్యాసో నారద: శౌనకో భృగు:**
**చ్యవనో యవనో గర్గ: కశ్యపశ్చ పరాశర:**
**అష్టాదశైతే గమ్భీరా: జ్యోతి:శాస్త్ర ప్రవర్తకా:**

నారద సంహిత.

ఈ కశ్యప జాతక గ్రంథము కశ్యపమహాముని ప్రణీతముగా భావించవలెను. కశ్యపగోత్ర వాసులైన అనేకమంది మహర్షులు వివిధ కాలములలోనున్నట్లుగా పురాణాదులననుసరించి తెలియచున్నది. వీరందరు వివిధ కశ్యప నామముతో ప్రసిద్ధి పొందిన వ్యక్తులు ఇదే సూత్రము మిగిలిన ఋషులకు కూడ వర్తించును.

హరివంశ పురాణము ననుసరించి మూల ఋషులు ఏడుగురు బ్రహ్మాపుత్రులు మహర్షులుగా భావింపబడిరి.

**మరీచి రత్రిర్భగవానఙ్గిరా: పులహ: క్రతు:**
**పులస్త్యశ్చ వశిష్ఠశ్చ సప్తైతే బ్రహ్మణ: సుత:**

**హరివంశ పురాణము**

వీరు ప్రథమ ఋషులు వీరికి అనేక తరములలో అనేక ఋషుల జన్మమైనది. మరీచిమహర్షికి ఐదవ తరము వానిగా కశ్యపుని ప్రస్తావన కనబడును. కశ్యపుడు దక్షుని పదమూడుమంది పుత్రికలను వివాహమాడెను. వారివలన అనేక జాతులు త్పన్నమనవి. దక్షుని పుత్రికల పేర్లు 1.అతిది 2.దితి 3.దను 4. కాల 5. అరిష్ట 6. దనాయు7.ఖశ 8.సురభి 9.వినత 10.తామ్ర 11.ముని 12. క్రోధవశ 13. కద్రువ.

కశ్యప ప్రజాపతి నామము అరిష్టనేమి. ఇతడు కశ్యపుని పుత్రుడగుట వలన కశ్యప కాశ్యప నామములతో ప్రసిద్ధుడయ్యెను. ఇతని నివాసము మేరుపర్వతము. ఇది హిమాలయ పర్వతములలో కాశ్మీరమునుండి మధ్య ఏషియా వరకు వ్యాపించి యున్నది. పురాణానుసారము సముద్రములోనున్న మేరువును బయటకు తీయుట వలన మేరుపర్వతము కశ్యపమేరువైనది.అదే పదము క్రమముగా పరివర్తనపొంది 'కాశ్మీర ' మైనది.

కశ్యపబ్రహ్మ అశ్వినీకుమారులకు ఆయుర్వేదము,అంగిరసులకు ధర్మశాస్త్రము, బృహస్పతికి వ్యాకరణము, భరతమునికి నాట్యశస్త్రము నేర్పెను. ఇతడు జ్యోతిషశాస్త్రమును కూడ నేర్చుకొనెను. కశ్యప ప్రజాపతికి కద్రువకు జన్మించిన పుత్రులు కాద్రవేయులు ప్రస్తుతము ఇరాన్ ఇరాక్ మధ్య ప్రదేశములోనున్న కుర్దులు

వీరే. వీరేకాక నాగాలాండ్‌లోనున్న నాగులు పోలెండులోనున్న సర్పులు (సార్ప్యదేశము) కద్రువ కశ్యపుల సంతానముగా భావించబడుతున్నారు. ఈ విధముగా కశ్యప నామముతో అనేకమంది ఋషులు పురాణ ప్రసిద్ధులైరి.

ప్రస్తుత గ్రంథ ప్రణీతయైన కశ్యపుడు పరమేష్టి కశ్యపుని వంశములో జన్మించిన వాడు. ఇతడనేక గ్రంథములను రచించెను. కశ్యప సంహితను రచించెను. కుమార తంత్రము (బాలరోగ చికిత్స) అగద తంత్రము, విష విజ్ఞానములలో పారంగతుడు. భారతములో పరీక్షితుని చరిత్రలో విష వైద్యునిగా కశ్యపు ప్రస్తావన కనపడును.

కశ్యపజాతకము జ్యోతిషశాస్త్ర గ్రంథములలో ప్రముఖ స్థానమును పొందినది. ఇతని రచనలలోని శ్లోకములు హెూరారత్నము బృహద్దైవజ్ఞ రంజనాది గ్రంథములలో కనపడును. కశ్యప జాతకములో పద్నలుగు అధ్యాయములున్నవి. మొదటి రెండు అధ్యాయములులో నక్షత్ర గ్రహయోగము ఆయువుల గురించి ప్రస్తావన కలదు. మూడవ అధ్యాయము నుండి పద్నాలుగవ అధ్యాయము వరకు గ్రహములు లగ్నాది భావములలో నున్నప్పుడు ద్వాదశ స్థితులలో వాటి ఫలములను గూర్చి ప్రస్తావించ బడినది. ఈ విధమైన జ్యోతిష విశ్లేషణ ఇతర గ్రంథములలో లభించదు. ఇది ఈ గ్రంథ విశిష్టతగా భావించవచ్చును. బిందువులో సింధువునమర్చి నట్లుగా 260 శ్లోకములలో గ్రహ ద్వాదశభావ స్థితిని అతివిపులముగా వివరించెను. దీనివలన జాతకమును వ్రాయు దైవజ్ఞులకు ఫలాదేశ విషయములో అధిక ప్రయోజనము కలుగును. చ్యవన మహర్షి వచనానుసారము ఫలితములను తెలియ జేయుచున్నానని చ్యవనఋషిపై తనకున్న భక్తిభావమును ప్రకటించెను.

ఈ గ్రంథమును పఠించుట వలన సహృదయులైన పాఠకులకు గ్రహములు వివిధ స్థితులలోనున్నపుడు కలుగు ఫలితములు తేలికగా అర్థమగును. ఈ గ్రంథాను వాదము మహర్షి అభయకాత్యాయన వ్యాఖ్యానానుసారము చేయబడినది.

ఈ గ్రంథము వలన జ్యోతిష విద్యార్థులకు జ్యోతిషశాస్త్రాభిలాషులకు ఏకొంత ప్రయోజనము కలిగినను నేను చేసిన కృషి సఫలమైనదని భావింతును.

గ్రంథ రచనలో, ముద్రణలో నున్న లోపములను సహృదయులైన పండితులు తెలియజేసిన మలిముద్రణలో సరిజేయగలవాడనని సవినయముగా విన్నవించు చున్నాను.

**భవదీయుడు**

**ఎం.విశ్వనాథ రాజు**

## విషయసూచిక



# కశ్యప జాతకము

## ప్రథమాధ్యాయము

**మంగళాచరణము**

**అథ స్వస్థాయ దేవాయ నిత్యాయ హతపాప్మనే**
**త్యక్త క్రమ విభాగాయ చైతన్య జ్యోతిషే నమ: 1**
**దిక్కాలాద్యనవచ్ఛిన్నానన్త చిన్మాత్రమూర్తయే**
**స్వానుభూత్యేకమానాయ నమ: శాన్తాయ తేజసే 2**
**అనన్తనామ ధ్యేయాయ సర్వాకార విధాయినే**
**సమస్త మన్త్ర వాచ్యాయ విశ్వైకపతయే నమ: 3**
**నమోవాఙ్మనసాతీత మహిమ్నే పరమేష్ఠినే**
**త్రిగుణాష్టగుణానన్త గుణ నిర్గుణ మూర్తయే 4**
**యథా తథాపి య: పూజ్యో యత్ర తత్రాపియోఽర్జిత:**
**యోఽపివా సోఽపివా యోఽసౌదేవస్తస్మైనమోస్తుమే 5**

స్వస్థ స్వరూపుడు,నిత్యుడు,పాపరహితుడు, క్రమ విభాగరహితమైన చైతన్య జ్యోతి స్వరూపుడైన పరమేశ్వరునికి నమస్కారము. దేశకాలముల కతీతుడు, అనంతుడు, చిన్మాత్ర స్వరూపుడు స్వయముగా ననుభవమును పొందువాడు, పరమశాంతుడు, తేజస్వి,అనేకనామములను ధరించినవాడు,అన్నిరూపములు కలవాడు, సమస్త మంత్రములకు వాచకుడైనవాడు,విశ్వమునకు స్వామియైన పరమేశ్వరునికి నమస్కారము.

త్రిగుణములు, అష్టమగుణములు, అనంతగుణములు కలిగినప్పటికి నిర్గుణుడు నిరాకారుడు, మనస్సుకు వాణికి అతీతుడైనవాడైన పరమేశ్వరునికి నమస్కారము.

ఏవిధమైన పూజలనైన గ్రహించువాడు, ఎక్కడైనను దర్శనమొసంగువాడు, ఏరూపము నైన పొందువాడైన పరమేశ్వరునికి నమస్కారము.

**జాతక శాస్త్ర విషయము :-**

**రాశిభేదే ఖేటయోనీ వియోని జన్మలక్షణమ్**
**నిషేకం జననం పుంసామరిష్టే భఙ్గలక్షణమ్ 6**
**ఆయుర్దాయో దశా భేదో జ్ఞేయా చాన్తర్దశాతథా**

**అష్టవర్గై: కర్మాజీవౌ రాజయోగాశ్చ నాభసా: 7**
**చాన్ద్రయోగా ద్విగ్రహాద్యా: ప్రవ్రజ్యా యోగ సమ్భవా:**
**రాశిశీలం దృష్టిఫలం గ్రహోభావఫలం తత: 8**
**ఆశ్రయాఖ్యాశ్చ యే యోగా: సఙ్కీర్ణ సమ్భవా:**
**స్త్రీజాతకం నష్టయోగం నిర్మాణం నష్ట జాతకమ్ 9**
**ద్రేక్కాణాది ఫలం సర్వం హోరాస్కన్ద సమ్భవ: 10**

రాశిభేదములు,గ్రహయోని,మనుష్యేతరయోని,జన్మలక్షణము.యోగము, గర్భాధాన లగ్నము,జన్మలగ్నము,అరిష్టప్రదయోగము,అరిష్టభంగము, ఆయుర్దాయము, దశఅంతర్దశా భేదము,అష్టకవర్గు, కర్మ జీవరాజయోగము, నాభసయోగము, చంద్ర యోగము, ద్విగ్రహ యోగము,త్రిగ్రహయోగము, చతుర్గ్రహయోగము, పంచగ్రహ యోగము, షడ్గ్రహ యోగము, సప్తగ్రయోగము, అష్టమగ్రహయోగము, ప్రవజ్యా (సన్యాసవైరాగ్య యోగము) రాశిశీలము, గ్రహదృష్టియోగము, గ్రహరాశి భావఫలము, ఆశ్రయయోగము, దుర్లభయోగము,స్త్రీజాతకము,నష్టయోగము,నిర్యాణము (మృత్యు సమయ జ్ఞానము) నష్టజాతకము, ద్రేక్కాణాది (హోర, ద్రేక్కాణ, సప్తమాంశ,నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశాదులు)ఫలము – వీటి జ్ఞానము జ్యోతిష శాస్త్రములో హోరా స్కంథము వలన తెలియును.

**నక్షత్రఫలము :–**

**అశ్విని – భరణి – కృత్తిక – రోహిణి నక్షత్ర ఫలము :–**

**అశ్విన్యామితబుద్ధి విత్తవినయప్రజ్ఞా యశస్వీ సుఖీ**
**యామ్యర్క్షే వికలోఽన్యదారారత: క్రూర: కృతఘ్నో ధనీ**
**తేజస్వీ బహులోద్భవ: ప్రభుసమోమూర్ఖశ్చ విద్యాధనీ**
**రోహిణ్యాం పరరన్ధ్రవిత్ కృశతనుర్బోధీ పరస్త్రీరత:11**

అశ్వినీ నక్షత్రములో జన్మించిన బాలుడు బుద్ధిమంతుడు, ధనవంతుడు, వినయము కలవాడు, మేధావి, యశస్వి, సుఖమును పొందువాడగును. భరణిలో జన్మించినవాడు వ్యాకులుడు, పరస్త్రీరతుడు, క్రూరుడు,కృతఘ్నుడు, ధనవంతు డగును.కృత్తికలో జన్మించిన వాడు రాజసమానుడు మూర్ఖుడు తేజస్వి ధని యగును. రోహిణిలో జన్మించినవాడు ఇతరుల తప్పులనెంచువాడు, కృశశరీరుడు బుద్ధిమంతుడు,పరస్త్రీగామి యగును.

**మృగశిర – ఆర్ద్ర– పునర్వసు – పుష్యమి నక్షత్ర ఫలము :–**

**చన్ద్ర: సౌమ్యమనోఽటన: కుటిలదృక్ కామాతురో రోగవాన్**
**ఆర్ద్రాయామ ధనశ్చలోఽధికబల: క్షుద్రక్రియాశీలవాన్**
**మూఢాత్మా చ పునర్వసౌ ధనబలఖ్యాత: కవి: కాముక:**
**తిష్యే విప్రసురప్రియ: సధనధీ రాజప్రియో బన్ధుమాన్ 12**

మృగశిరలో జన్మించినవాడు సౌమ్యస్వభావము కలవాడు, భ్రమణశీలుడు, వంకర

దృష్టి కలవాడు,కామాతుడు,అనారోగ్యవంతుడగును.ఆర్ద్రా నక్షత్రంలో జన్మించినవాడు ధనహీనుడు చంచలుడు శారీరిక దృష్టితో బలవంతుడైనను చెడుకర్మలు చేయువాడగును. పునర్వసులో జన్మించినవాడు మూఢుడు,ధనవంతుడు,బలవంతుడు,ప్రసిద్ధుడు, విద్వాంసుడు, కాముకుడగును.పుష్యమిలో జన్మించినవాడు సాధు బ్రాహ్మణ దేవతలకు భక్తుడు, ధనవంతుడు, బుద్ధిమంతుడు, బంధువులు కలవాడు రాజప్రియుడగును.

**ఆశ్లేష – మఘ – పుబ్బ – ఉత్తర నక్షత్ర ఫలము :-**

**సార్పేగూఢమతి: కృతఘ్నవచన: కోపీకృతాచారవాన్**
**గర్వీపుణ్యరత: కలత్రవశగో మానీమఘాయాం ధనీ**
**ఫాల్గున్యాం చపల: కుకర్మ చరితస్త్యాగీ దృఢ: కాముక:**
**భోగీచేత్ తరఫాల్గునీభే జనితో మానీ కృతజ్ఞ: సుధీ: 13**

ఆశ్లేషా జాతకుడు గూఢమతి, కృతఘ్నుడు, కఠోర వచనములు పలుకువాడు, క్రోధ స్వభావము గలవాడగును. మఘలో పుట్టినవాడు గర్వము కలవాడు, పుణ్యశీలుడు.పత్నికి వశమైన వాడు, అభిమానవంతుడు, ధనవంతుడగును. పుబ్బలో పుట్టినవాడు చపలుడు, చెడుకర్మలు చేయువాడు,చరిత్రహీనుడు, ధృఢమైనవాడు, కాముకుడగును.ఉత్తరలో జన్మించినవాడు స్వాభిమాని,కృతజ్ఞుడు,బుద్ధిమంతుడగును.

**హస్త – చిత్త – స్వాతి – విశాఖ నక్షత్ర ఫలము :-**

**హస్తర్క్షే యది కర్మ ధర్మనిరత: ప్రాజ్ఞోపకర్తా ధనీ:**
**చిత్రాయామతి గుప్తశీలనిరతో మానీపరస్త్రీరత:**
**స్వాత్యాం దేవ మహీసురప్రియకరో భోగీధనీ మన్దధీ:**
**గర్వీదారవశోజితారి రధికో క్రోధీ విశాఖోద్భవ: 14**

హస్త నక్షత్ర జాతకుడు ధర్మకర్మలందు నిరతుడు, పరోపకారి, బుద్ధిమంతుడు, ధనవంతుడగును. చిత్తలో జన్మించినవాడు గుప్తచరిత్ర కలవాడు, అభిమానవంతుడు, పరస్త్రీ రతుడగును. స్వాతిలో జన్మించినవాడు దేవబ్రాహ్మణులను పూజించువాడు, భోగి,ధని,మందబుద్ధివాడగును. విశాఖలో జన్మించినవాడు అహంకారి, స్త్రీవశుడు, శత్రువులపై విజయమును పొందువాడు. అధికమైన కోపము కలవాడగును.

**అనురాధ – జ్యేష్ఠ – మూల – పూర్వాషాఢ నక్షత్ర ఫలము :-**

**మైత్రే సుప్రియవాక్ ధనీ సుఖరత: పూజ్యోయశస్వీ విభు:**
**జ్యేష్ఠాయామతి కోపవాన్ పరవధూసక్తో విభుర్ధార్మిక:**
**మూలర్క్షే పటువాగ్విధూత కుశలోధూర్త: కృతఘ్నోధనీ**
**పూర్వాషాఢ భవో విచారచిత్తో మానీసుఖీ శాన్తధీ: 15**

అనురాధ జాతకుడు ప్రియభాషి,ధని,సుఖి,సమ్మానితుడు,యశస్వి ప్రభావశాలి యగును.జ్యేష్ఠా నక్షత్ర జాతకుడు అతిక్రోధి, పరస్త్రీ రతుడు, ప్రభావశాలి, దార్మికుడగును. మూలలో జన్మించిన జాతకుడు పటువు,వాగ్మి కుశలుడు,ధూర్తుడు,కృతఘ్నుడు,

ధనవంతుడగును. పూర్వాషాఢ నక్షత్ర జాతకుడు విచారశీలుడు, స్వాభిమాని, సుఖి, శాంత స్వభావుడగును.

**ఉత్తరాషాఢ - శ్రవణ - ధనిష్ఠ - శతభిష నక్షత్ర ఫలము :-**

**మాన్య: శాన్తగుణాసుఖీ చ ధనవాన్ విశ్వర్క్షజ: పణ్డిత:**
**శ్రోత్రాయాం ద్విజదేవభక్తినిరతో రాజాధనీ ధర్మవాన్**
**ఆశ్వాలుర్వసుమాన్ వసూడుజనిత: పీనోరు కణ్ఠ: సుఖీ**
**కాలజ్ఞ: శతతారకోద్భవ: నర: శాన్తోऽల్ప భుక్ 16**

ఉత్తరాషాఢలో జన్మించిన జాతకుడు మాన్యుడు,శాంతుడు,సుఖి,ధని, పండితుడగును.శ్రవణంలో జన్మించిన జాతకుడు దేవబ్రాహ్మణభక్తుడు,రాజసమానుడు, ధని, ధార్మికుడగును. ధనిష్ఠలో జన్మించిన ఆశావాది, ధనవంతుడు, పుష్టశరీరుడు, పుష్ఠ జంఘములు (లావైన తొడలు) పృష్ఠగ్రీవములు కలవాడు సుఖియగును. శతభిషంలో జన్మించినవాడు కాలమును తెలిసినవాడు, శాంతుడు, స్వల్పభోజనము చేయువాడగును.

**పూర్వాభాద్ర - ఉత్తరాభాద్ర - రేవతి నక్షత్రఫలము**

**పూర్వప్రౌష్ఠపది ప్రగల్భవచనో ధూర్తో భయార్తోమృదు:**
**అహిర్బుధ్న్య జమానవో మృదుగుణస్త్యాగీ ధనీపణ్డిత:**
**రేవత్యా మురులాఞ్ఛనోపగ తను: కామాతుర: సున్దరో**
**మన్త్రీపుత్ర కలత్రమిత్ర సహితో జాత: స్థిర: శ్రీరత: 17**

పూర్వాభాద్రలో జన్మించిన జాతకుడు ప్రగల్భములు పలుకువాడు, ధూర్తుడు, భయభీతుడు,మృదుస్వభావము కలవాడగును.ఉత్తరాభాద్రలో జన్మించినవాడు మృదు మనస్తత్వము కలవాడు, గుణవంతుడు, త్యాగి ధని,బుద్ధిమంతుడగును.రేవతిలో జన్మించినవాడు మోకాలిపైభాగములో లాంఛనము కలవాడు, కామాతురుడు, సుందరుడు, మంత్రి పుత్రుడు, భార్య మిత్రులు కలవాడు, స్థిరుడు, ధనము కలవాడగును.

**హోరా - ద్రేక్కాణ కథనము :-**

**హోరా రవీన్ద్వోరోజర్క్షే సమభే చన్ద్రసూర్యయో:**
**స్యుర్ద్రే ష్కాణా లగ్న పఞ్చ నవరాశీశ్వరా: 18**

హోర - రాశిలో సగము హోర యగును.విషమరాశులలో ప్రథమహోర ( 1 నుండి 15 అంశల వరకు) సూర్యుని సింహరాశి, రెండవ హోర (15 నుండి 30అంశల చంద్రుని రాశి కర్కాటక రాశియగును. సమరాశులలో ప్రథమహోర చంద్రరాశి కర్కాటకము ద్వితీయహోర సూర్యుని సింహరాశి యగును.

ద్రేక్కాణము - రాశిని మూడు భాగములు చేసిన ద్రేక్కాణమగును.

ప్రథమ ద్రేక్కాణము 10 అంశలు ప్రతిరాశిలో ప్రథమ ద్రేక్కాణమునకు ఆరాశిస్వామి, ద్వితీయ ద్రేక్కాణమునకు (11నుండి 20 అంశలు) దానినుండి ఐదవ రాశిస్వామి, తృతీయ ద్రేక్కాణమునకు(21నుండి30అంశలు)తొమ్మిదవరాశి స్వామిఅధిపతి యగును.

హోరా చక్రము

| రాశులు | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 15అంశల వరకు | 5 | 4 | 5 | 4 | 5 | 4 | 5 | 4 | 5 | 4 | 5 | 4 |
| 15-30 అంశలు | 4 | 5 | 4 | 5 | 4 | 5 | 4 | 5 | 4 | 5 | 4 | 5 |

పరాశర జైమినిమతము - హోరాచక్రము

| రాశులు | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 15అంశల వరకు | 1 | 3 | 5 | 7 | 9 | 11 | 1 | 3 | 5 | 7 | 9 | 11 |
| 15-30 అంశలు | 2 | 4 | 6 | 8 | 10 | 12 | 2 | 4 | 6 | 8 | 10 | 12 |

ద్రేక్కాణ చక్రము ( వరాహమతము )

| రాశులు | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 10 అంశలు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| 20 అంశలు | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 |
| 30 అంశలు | 9 | 10 | 11 | 12 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 |

ద్రేక్కాణ చక్రము ( ఉత్తరకాలామృత మతము )

| రాశులు | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 10 అంశలు | 1 | 10 | 7 | 4 | 1 | 10 | 7 | 4 | 1 | 10 | 7 | 4 |
| 20 అంశలు | 5 | 2 | 11 | 8 | 5 | 2 | 11 | 8 | 5 | 2 | 11 | 8 |
| 30 అంశలు | 9 | 6 | 3 | 12 | 9 | 6 | 3 | 12 | 9 | 6 | 7 | 8 |

ద్రేక్కాణ చక్రము ( ఋషుల మతము )

| రాశులు | మేష | వృష | మిథు | కర్కా | సింహ | కన్య | తుల | వృశ్చి | ధను | మక | కుంభ | మీన |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 10 అంశలు | 1 | 4 | 7 | 10 | 1 | 4 | 7 | 10 | 1 | 4 | 7 | 10 |
| 20 అంశలు | 2 | 5 | 8 | 11 | 2 | 5 | 8 | 11 | 2 | 5 | 8 | 11 |
| 30 అంశలు | 3 | 6 | 9 | 12 | 3 | 6 | 9 | 12 | 3 | 6 | 9 | 12 |

**అభుక్తమూల కథనము :-**

జ్యేష్ఠాన్త్య మూలయోరన్తరాల కాలోద్భవ: శిశు:
అభుక్తమూలజ: సోఽథ శ్లేషాపితృభయోరపి 19

జ్యేష్ఠా నక్షత్రము చివరిలో మూలా నక్షత్ర ప్రారంభములో అదేవిధముగా ఆశ్లేష అంతములో మఖానక్షత్ర ప్రారంభములో జన్మించిన బాలుడు లేక బాలిక అభుక్త మూలములో జన్మించినట్లుగా భావించవలెను.

**విశేషము :-** ఈ సమయము ఆది అంతముల నక్షత్ర సంధిలో 7 1/2 ఘడియల వరకుండును. అనగా జ్యేష్ఠ నక్షత్రము చివరిలో మూడు ముప్పావు ఘడియలు మూల నక్షత్ర ప్రారంభములో మూడు ముప్పావు ఘడియలలో జన్మించిన బాలుడు అభుక్త మూలములో జన్మించినట్లుగా భావించవలెను. ఇదే విధముగా ఆశ్లేష చివరిలో మూడు ముప్పావు ఘడియలు మఖ ప్రారంభములో మూడుముప్పావు ఘడియలలో జన్మించిన ఆసమయము అభుక్త మూలమనబడును. గండ నక్షత్రములలో రేవతి అశ్విని కూడ వచ్చును కాని ఇవి అధికదోషమును పొందవు. అందువలన కశ్యపుడు వీటిగురించి తెలియ జేయలేదు. నారదుడు రేవతి అశ్వినీ నక్షత్ర సంధికాలమును కూడ అభుక్త మూలము గా తెలిపెను.

అభుక్తమూల సమయములో జన్మించిన శిశువుకు శాంతి ఒకమాసము తర్వాత అదే నక్షత్రములో చేయవలెను. లేనియెడల తొమ్మిది వర్షములు రాకుండ తప్పక శాంతి చేయవలెను. దానివలన జీవితములో ఉత్పన్నమగు అశుభ ఫలములనుండి జాతకునికి అతని తల్లిదండ్రులకు రక్షణకలుగును.

**అభుక్తమూల ప్రదర్శకచక్రము (కశ్యపమతానుసారము)**

| అభుక్తమూల నక్షత్రము | ఆశ్లేష | మఘ | జ్యేష్ఠ | మూల |
|---|---|---|---|---|
| **తాజ్యకాలము** | 3 ఘడి<br>45 విఘ<br>అంతములో | 3 ఘడి<br>45 విఘ<br>ఆదిలో | 3 ఘడి<br>45 విఘ<br>అంతములో | 3 ఘడి<br>45 విఘ<br>ఆదిలో |

**జన్మ నక్షత్ర ఫలవిచారము :-**

**జన్మభే జన్మ సమయే పాపగ్రహ సమన్వితే**
**గుణాశ్చ నిర్గుణా: సర్వే శుభయుక్తోఽ గుణా గుణా: 20**

జన్మ సమయములో జన్మనక్షత్రములో ఏదైనా పాగ్రహమున్న ఆనక్షత్రము వలన శుభ ఫలితము (శ్లోకము 11 నుండి 18 వరకు )కలుగదు. ఆనక్షత్రము వలన కలుగు అశుభఫలితమధికమగును. కాని జన్మ నక్షత్రములో ఏదైన శుభగ్రహమున్న ఆనక్షత్రము వలన శుభ ఫలితమధికమగును. అశుభ నక్షత్రము వలన కలుగు చెడు ఫలితములు తక్కువగును.

**ఉదాహరణకు :-** అశ్విని నక్షత్రములో జన్మించిన జాతకుడు అధిక బుద్ధిమంతుడు, ధనవంతుడు, వినయయుక్తుడు, ప్రజ్ఞావంతుడు, యశస్వి, సుఖియగునని తెలిపెను. ఆ నక్షత్రములో శనియున్న పైనతెల్పిన శుభగుణములు నిష్ఫలమగును. జాతకుడు

బుద్ధిహీనుడు ధనహీనుడు వినయహీనుడు దు:ఖియగును. ఒకవేళ జన్మ నక్షత్రములో శుభ పాప గ్రహములు రెండు ఉన్నప్పుడు ఏగ్రహ బలమధికముగా ఉన్నదో ఆగ్రహ ప్రభావము జాతకునిపై నుండును. ఈ విధముగా కశ్యపుడు అతిమహత్వ పూర్ణమైన సిద్ధాంతమును తనగ్రంథములో తెలిపెను. జన్మ సమయములో చంద్ర నక్షత్రము, లగ్న నక్షత్రముల ఫలములను చూడవలెను. రాశికన్న నక్షత్ర ఫలితము అతి సూక్ష్మ మైనదిగా భావించవలెను.

**నక్షత్రపాద ఫలము :-**

**మూలాద్యపాదజో హన్తి పితరం తు ద్వితీయజ:**
**మాతరం స్వాం తృతీయోఽర్థాన్సుహృదశ్చ తురీయజ:** 22

మూల ప్రథమపాదములో జన్మించిన తండ్రికి హాని కలుగును. ద్వితీయ చరణమైన మాతకు, తృతీయ చరణమైన జన్మించిన వారి ధనమునకు హాని కలుగును. చతుర్థ చరణమైన జన్మించిన వారికి శుభము కలుగను.

**సింహ కర్కటయోశ్చాపం కీటయోర్మీన మేషయో:**
**గణ్డాన్తమన్తరాలం తన్నాడికా నిధనప్రదా** 22

కర్కాటక సింహరాశుల సంధి ఘడియలు, వృశ్చిక ధనూరాశుల సంధి ఘడియలు, మీన మేషరాశుల సంధి ఘడియలు జాతకునికి హానిని కలిగించును.

**వర్ష ఆయన మాస ఋతువుల సంధి కాల ఫలము :-**

**వత్సరాయన మాసర్తు సన్ధిర్దైన్యప్రద: శుభే**
**తిథిసన్ధౌ మనస్తాపో ధిష్ణ్య సన్ధౌ మహద్భయమ్** 23
**యోగసన్ధౌ భ్రమస్తీవ్రో లగ్న సన్ధౌ సుఖక్షయ:**
**తిథిలగ్న భగణ్డాన్తే కార్యనాశ క్షతిర్మృతి:** 24
**క్రాన్తి సామ్యే మృతి: కర్తుర్వ్యతీపాతే కులక్షయ:**
**వైధృతౌ జీవహాని: స్యాత్ పరిధార్ధం చ రోగదమ్** 25

వర్షసంధి, మాససంధి, ఋతుసంధులలో జన్మించిన వ్యక్తి అతిదీనుడుగా జీవించ వలసివచ్చును. తిథిసంధిలో జన్మించిన మనస్తాపము, నక్షత్రసంధిలో జన్మించిన భయ కారకము, యోగసంధిలో జన్మించిన తీవ్రభ్రమణము, లగ్నసంధిలో జన్మించిన సుఖ క్షయము కలుగును. వీటిలో కార్యహాని, మృత్యుభయము కలుగును. క్రాంతి సామ్య యోగములో మృత్యుభయము వ్యతీపాతయోగములో కులహాని వైధృతియోగములో ప్రాణహాని, పరిఘయోగ ప్రారంభంపు సగభాగములో జన్మించిన రోగభయము కలుగును.

**విశేషము :-** వైధృతి వ్యతీపాతయోగములలో జన్మించిన విశేషమైన హానికలుగును. అందువలన వీటిలో శాంతిని చేయవలెను. అమావాస్య కృష్ణ చతుర్దశులలో జన్మించి నను శాంతిని తప్పక చేయవలెను.

**గ్రహణములో జన్మించిన ఫలము :-**

**గ్రస్తోదయే పరోదోషో గ్రస్తాస్తే_ర్వాక్ శశీనయో:**
**ద్యునిశార్థే భయం స్యాత్తు ఖణ్డే ఖణ్డ వ్యవస్థయో 26**

సూర్య చంద్ర గ్రహణములలో గ్రస్తోదయమైన దాని ఫలితము ఆలస్యముగా కలుగును.గ్రస్తాస్త గ్రహణములో జన్మించిన అశుభఫలము వెంటనే కలుగును. ప్రసవమునకు పూర్వమే మాతాదులకు కష్టము కలుగును. అర్ధరాత్రి లేక మధ్యాహ్న సమయములో గ్రహణమైన అధిక భయకారకమగును.సంపూర్ణ గ్రహణములో అశుభఫలము సంపూర్ణముగా కలుగును. ఖండగ్రాసములో అనుపాతముననుసరించి అశుభ ఫలము కలుగును. (గ్రహణములో జన్మించిన శిశువుకు శాంతిని చేయవలెను.)

**తిథి గండాంత కథనము :-**

**పూర్ణానన్దాఖ్యయోస్తిథ్యో: సన్ధిర్నాడీ చతుష్టయమ్**
**ఉద్వాహ జన్మయానేషు గణ్డాన్తం నిధన ప్రదమ్ 27**

పంచమి షష్ఠి తిథుల సంధిలో నాలుగు ఘడుయలు దశమి ఏకాదశి తిథుల సంధిలో నాలుగు ఘడియలు,పూర్ణిమ కృష్ణపాద్యమి తిథుల సంధిలో నాలుగు ఘడియలు, అమావాస్య శుక్లపాద్యమి తిథులసంధిలో నాలుగు ఘడియలలో జన్మించిన తిథి గండాంతమగును. ఇది మృత్యుకారకమగును. ఈ తిథి గండాంతములలో వివాహము యాత్రలు చేయరాదు.

**క్రూరగ్రహయుక్త జన్మ నక్షత్ర ఫలము :-**

**క్రూరవిద్ధఙ్చ యద్ధిషాం నిఖిలంనైవ పాదత:**
**విద్యతే యస్య జన్మని న భవేత్ తస్య సౌఖ్యద: 28**

జన్మ సమయములో జన్మ నక్షత్రపు చరణము క్రూరగ్రహముతో కూడియున్న లేక విద్ధమైన జాతకునికి కష్టము కలుగును.
విశేషము :- జన్మనక్షత్రము అశుభగ్రహముతో విద్ధమైన సర్వోషధములతో స్నానము, గురుబ్రాహ్మణ దేవార్చనము చేయవలెనని చ్యవనమహర్షి తెలిపెను.

**జన్మ సమయములో కులాకుల గుణఫలము :-**

**కులయోగే ప్రసూత యే కులోత్కృష్టా భవన్తి తే**
**అకులేనస్య భోక్తారో మధ్యమాశ్చ కులా_కులే 29**

కుల నక్షత్రములలో జన్మించిన జాతకుడు తనకులములో ప్రతాపవంతుడగును. కాని ఆకుల నక్షత్రములలో జన్మించినవాడు భోగములననుభవించలేడు.కులాకుల నక్షత్రములలో జన్మించినవాడు మధ్యమముగా సుఖభోగముల ననుభవించును.
విశేషము :- నరపతి జయ చర్యలో కులాకుల నక్షత్రము గూర్చి తెలియజేసెను.

శతభిషం,ఆర్ద్ర,అభిజిత్తు,మూల - ఈ నాలుగు కులాకుల నక్షత్రములు. భరణి, రోహిణి, పుష్యమి,మఘ,ఉత్తర, చిత్త, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, శ్రవణ, ఉత్తరాభాద్రపద

– ఈ 11 నక్షత్రములు కుల సంజ్ఞక నక్షత్రములు. మిగిలిన అశ్విని, కృత్తిక,మృగశిర, పునర్వసు, ఆశ్లేష,పుబ్బ,హస్త, స్వాతి, అనూరాధ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, పూర్వాభాద్ర, రేవతి ఈ 13 నక్షత్రములు అకుల సంజ్ఞక నక్షత్రములు. నరపతి జయ చర్యలో తిథులు, వారములను కూడ కుల – అకుల – కులాకుల రూపములో వర్గీకరణము చేసెను.

**కులా కులాది సంజ్ఞా చక్రము**

| సంజ్ఞ | కుల | అకుల | కులాకుల |
|---|---|---|---|
| తిథి | 4, 8, 12, 14 | 1,3,5,9,11,13,15 | 2, 7, 10, 6 |
| వారములు | మంగళ శుక్ర | రవి సోమ గురు శని | బుధ |
| నక్షత్రములు | భ, రో, పుష్య మఘ,ఉత్తర,చి, విశా, జ్యేష్ఠ | అశ్వి,కృ,మృగ,పున ఆశ్లే, పుబ్బ,హస్త, స్వాతి, అను,ఉషా,ధని,పూభా పూషా,శ్రవ,ఉ.భా రేవతి. | శత,ఆర్ద్ర అభిజిత్తు,మూల |

**కశ్యప జాతకములో ప్రథమాధ్యాయము సమాప్తము**

## ద్వితీయాధ్యాయము
## ( అరిష్టాధ్యాయము )

**అష్టమవర్షములో మృత్యుయోగము :-**

**షష్ఠాష్ట రిష్ఫగశ్చంద్ర: క్రూరైశ్చ సహ వీక్షిత:**
**జాతస్య మృత్యుద: సద్యస్త్వష్టవర్షై: శుభే క్షిత:** 1

జన్మ సమయములో ఆరు,ఎనిమిది, పన్నెండు భావములలో నున్న చంద్రుడు గ్రహము లతో చూడబడిన శీఘ్రమృత్యుకారకమగును. కాని ఆరు ఎనిమిది పన్నెండు భావములలోనున్న చంద్రుడు శుభగ్రహములతో చూడబడిన ఎనిమిదవ సంవత్సరము లో మృత్యువు కలుగును.

**అన్య విధముగా మృత్యుయోగము :-**

**శశివన్మృత్యుదా: సౌమ్యా: చేద్ వక్రా: క్రూరేక్షితా:**
**శిశోర్జాతస్య మాసేనలగ్నే సౌమ్య వివర్జితే** 2

ఆరు,ఎనిమిది,పన్నెండుభావములలో వక్రియైన శుభగ్రహముండి దానిపై పాప గ్రహములదృష్టి యున్న శీఘ్రమృత్యువు కలుగును. కాని ఈయోగములో లగ్నములో శుభగ్రహము లేకున్నపుడు యోగము కలుగును. లగ్నములో శుభగ్రహమున్న మృత్యు యోగము కలుగదు.

**మాతా భ్రాతుల అరిష్టయోగము :-**

**యస్య జన్మ నిధీస్థా: స్యు: సూర్యార్కీన్దు కుజాభిధా:**
**యస్య జాతో జనిత్రీ చ భ్రాతా చ నిధనం లభేత్ 3**

పంచమభావములో సూర్య చంద్ర శని మంగళ గ్రహములున్న జాతకుని తల్లికి సోదరునికి మృత్యువు కలుగును.

**విశేషము :-** ఈ యోగము పైగ్రహములపై శుభగ్రహదృష్టి లేనపుడు మాత్రమే జరుగును. చంద్రుడు మాతృకారకుడు అతుడు పాపగ్రహ పీడితుడైన మాతృహాని కారకుడగును.

**నిధనయోగము :-**

**పాపేక్షిత యుతో భౌమ: లగ్నగో నశుభేక్షిత:**
**మృత్యుదస్త్వష్టమస్థో<u>ౖ</u> పి సౌరేరార్కేణ వాపున: 4**

లగ్నములో పాపగ్రహముచే చూడబడిన లేక పాపగ్రహముతో కూడిన, కుజ గ్రహమున్న దానిపై శుభగ్రహదృష్టి లేకున్న జాతకునికి అరిష్టము కలుగును. ఇదే విధముగా కుజగ్రహము అష్టమభావములోనున్న దానితోపాటు సూర్యశనులున్న లేక వారిదృష్టియున్న జాతకునికి అరిష్టమగును. ఇక్కడ లగ్నముపై శుభగ్రహ ప్రభావము లేనపుడు మాత్రమే ఈయోగము కలుగును.

**పాపాన్విత: శశీ ధర్మ ద్యూన లగ్న గతో యది**
**శుభైరవీక్షిత యుతస్తదా మృత్యుప్రద:శిశో: 5**

లగ్నములో పాపగ్రహములతో పాటు చంద్రుడున్న దానిపై శుభగ్రహ దృష్టి లేకున్న జాతకునికి మృత్యుకారకమగును.

సప్తమభావములో పాపగ్రహములతో చంద్రుడు కూడియున్న దానిపై శుభగ్రహ దృష్టి లేకున్న బాలకునికి అరిష్టప్రదమగును.

నవమభావములో చంద్రుడు పాపగ్రములతో కూడియున్న లేక వాటి దృష్టి యున్న శుభగ్రహముల దృష్టి లేకున్న జాతకునుకి అరిష్టము కలుగును.

**విశేషము :-** లగ్నము శరీరమగును.దాని నుండి సప్తమభావము కూడ అదేస్థితి కలిగి ఉండును. ఎందువలననగా సప్తమభావము కూడ సంపూర్ణముగా లగ్నముతో ప్రభావిత మగును. ఇదే విధముగా నవమభావము పూర్వజన్మకృత పుణ్యభావమగును. ఆభావములో పాపగ్రహముల స్థితి లేక వాటి దృష్టియున్న పూర్వజన్మకృత పుణ్యము క్షీణించి జాతకునికి మృత్యుకారకమగును.

**సన్ధ్యాయాం చన్ద్రహోరాయాం గణ్డాన్తే నిధనాయవై**
**ప్రత్యేకం చన్ద్రపాపైశ్చ కేన్ద్రగై: స్యాద్ వినాశనమ్ 6**

సంధ్యా సమయములో జన్మమైన దానిలో చంద్రునిహోర ఉన్న, గండాంతమైన, చంద్రుని నుండి నాలుగు కేంద్రములలో పాపగ్రహములున్న జాతకునికి శీఘ్రమే

మృత్యువు కలుగును.
**విశేషము :-** గండాంతము మూడు విధములుగా నుండును.

చంద్ర నక్షత్ర గండాంతము, లగ్న నక్షత్ర గండాంతము, తిథి గండము.

**చంద్రనక్షత్ర గండము :** చంద్రుడు మీన,కర్కాటక,వృశ్చికరాశుల అంతిమ అంశములలో నున్న (30 వ అంశము) చంద్ర నక్షత్ర గండమగును. ఇదేవిధముగా మేష సింహ ధనూరాశులలో చంద్రుడు మొదటి అంశలోనున్న గండమగును.

**లగ్నగండము :** మీన కర్కాటక వృశ్చిక లగ్నములలో 30వ అంశములో జన్మించిన లేక మేష సింహ ధనూలగ్నములలో ప్రథమాంశలలో జన్మించిన లగ్న గండమగును.

**తిథిగండము :** పూర్ణ తిథిఅంతములో నంద తిథిలో ఒక్కొక్క ఘడియ అశుభమగును. దీనిని తిథిగండమందురు. పాడ్యమి, షష్ఠి, ఏకాదశులు నంద తిథులు. ఈ తిథులలో ప్రథమ ఘడియలలో జన్మించిన తిథి గండమగును. ఇదేవిధముగా పంచమి, దశమి,పూర్ణిమ,అమావాస్య పూర్ణతిథుల అంతిమఘడియలు తిథి గండాంతములగును.

ఈ మూడు గండములలో శిశువు జన్మించిన మరణభయము కలుగును. ఈ గండములలో జన్మించిన జాతకుడు జీవుతుడైన ధనవంతుడగును.

**సంధ్యాకాల పరిభాష : -**

**రవేస్తుమణ్డలార్ధాస్తాత్ సాయం సన్ధ్యాత్రినాడికా**
**తత్పూర్వార్ధోదయాత్ పూర్వం ప్రాత: సన్ధ్యా త్రినాడికా** 7

సూర్యోదయమునకు మూడు ఘడియల పూర్వమునుండి పూర్వ క్షితిజములో సూర్యుడుదయించు వరకు ప్రాత: సంధ్యయని పిలవబడును.సూర్యాస్తమయము సగమైన తర్వాత మూడు ఘడియల వరకున్న సమయము సాయంసంధ్యయగును.

**లగ్నార్థ అరిష్టజ్ఞానము :-**

**చక్రపూర్వా పరార్ధేషు క్రూర సౌమ్యేషు కీటభే**
**లగ్నగే నిధనం యాతి నాత్రకార్యా విచారణా** 8

వృశ్చికలగ్నమై పూర్వార్ధములో క్రూరగ్రహము, ఉత్తరార్ధములో శుభగ్రహమున్న జాతకునికి ధనమగును.

లగ్నములో 30 అంశలుండును.మొదటి పదిహేను అంశలు పూర్వార్ధము, తర్వాత పదిహేను అంశలు ఉత్తరార్ధమగును.

ఉదాహరణకు లగ్నము వృశ్చికములో 10 అంశలందు ప్రారంభమైన వృశ్చికములో 25 అంశముల వరకు లగ్న ప్రథమార్ధము ధనుస్సులో 10 అంశల వరకు లగ్నమునకు ఉత్తరార్ధమగును.

ఉదాహరణకు లగ్నము వృశ్చికములో 10 అంశలందు ప్రారంభమైన వృశ్చికములో 25 అంశముల వరకు లగ్న ప్రథమార్ధము ధనుస్సులో 10 అంశల వరకు లగ్నమునకు ఉత్తరార్ధమగును.

**దుస్థానగత పాపగ్రహ ఫలము :-**

**వ్యయశత్రుగతై: క్రూరై: మృత్యుద్రవ్యగతైరపి**
**పాపమధ్య గతేలగ్నే సత్యమేవ మృతింవదేత్ 9**

ఆరు,పన్నెండు భావములలో మరియు రెండు,ఎనిమిది భావములలో పాప గ్రహము లున్నను,లగ్నమునకు పాపగ్రహములు మధ్యలోనున్న బాలకునికి నిశ్చయముగా బాలారిష్టము కలుగును.

**విశేషము -** ఈ యోగములో రోగ (ఆరు) మృత్యు(ఎనిమిది)భావములలో పాప గ్రహములుండుటతోపాటు వాటిదృష్టికూడ లగ్నపు రెండుపార్శ్వములలో నుండును. లగ్నము పాపగ్రహమధ్యమగును.

**శీఘ్ర అరిష్ట యోగము :-**

**లగ్న సప్తమ గోపాపౌ చన్ద్రోఽపిక్రూర సంయుత:**
**యదాత్వవీక్షితై: సౌమ్యై: శీఘ్రాన్మృత్యుర్భవేత్తదా 10**

లగ్న సప్తమభావములలో పాపగ్రహములున్న చంద్రుడు క్రూరగ్రహములతో కూడియున్న, లగ్న చంద్రులపై శుభగ్రహదృష్టి లేకున్న వెంటనే మృత్యువు కలుగును.

**క్షీణ చంద్రుని వలన అరిష్టము :-**

**జీర్ణై: శశినిలగ్నస్థే పాపై: కేన్ద్రాష్ట సంస్థితై:**
**యో జాతో మృత్యులాప్నోతి సోవిశత్రుర్న సంశయ: 11**

లగ్నములో క్షీణచంద్రుడున్న కేంద్ర,అష్టమ(1,4,7,10)భావములలో పాప గ్రహము లున్న మృత్యువు కలుగును.అది శత్రుగ్రహ రహితమగును,దీనిలో సందేహము లేదు.

**శీఘ్ర అరిష్టయోగము :-**

**పాపయోర్మధ్యమశ్చన్ద్ర: లగ్నాష్టమ సప్తగ:**
**అచిరాన్మృత్యు మాప్నోతి యోజాత: సశిశుస్తదా 12**

లగ్న సప్తమభావములలో చంద్రుడున్న లేక అష్టమభావములోనున్న దానికి వెనుక పాపగ్రహమున్న జాతకునికి వెంటనే మృత్యువు కలుగును.

**మాతా శిశుమరణ యోగము :-**

**పాపద్వయ మధ్యగతే చన్ద్రే లగ్నం సాశ్రితే**
**సప్తాష్టమేన పాపేన మాత్రాసహమృత: శిశు: 13**
**రవౌపాపాన్వితే గ్రస్తే యదాలగ్నం సమాశ్రితే**
**అష్టమస్థే కుజే శస్త్రాన్మృతి: స్యాన్మాత్రుబాలయో: 14**

లగ్నములోనున్న చంద్రుడు రెండు పాపగ్రహముల మధ్యలోనున్న దానితో పాటు సప్తమ అష్టమభావములలో పాపగ్రహములస్థితి ఉన్నప్పుడు మాతా శిశువు లిరువురికి మరణము కలుగును.

**విశేషము :–** లగ్నము స్వయంకారకము (పుట్టిన బాలునికి సంబంధించినది) చంద్రుడు మాతృకారకుడు అందువలన ఇద్దరిపై పాపగ్రహముల ప్రభావమున్న ఇరువురికి మృత్యువు కలుగును.

**అన్యారిష్ట యోగము :–**

**శనైశ్చరార్క భౌమేషు రిష్ఫాధర్మాష్టేషు చ**
**శుభైరవీక్ష్యమాణేషు యో జాతో నిధనజ్గత: 15**

శని పన్నెండవభావములో, సూర్యుడు నవమభావములో, కుజుడు ఎనిమిదవ భావములో నుండి వాటిపై శుభగ్రహదృష్టి లేకున్న జాతకునికి మృత్యువు కలుగును.

**ఫలకథన విశేషము :–**

**పాపేక్షిత యుతాస్తే తే యోగాశ్చోక్త ఫలప్రదా:**
**సౌమ్యేక్షిత యుతాస్తేఽ పి సర్వథా విఫలప్రదా: 16**

పైనతెల్పిన యోగములలో కేవలము పాపగ్రహముల యుతి, దృష్టి వలన అరిష్టము కలుగును. కాని వాటిపై శుభగ్రహముల దృష్టి యున్న అరిష్టభంగము కలుగును.

**అరిష్టనాశక యోగము :–**

**ఏకోపి జ్ఞార్య శుక్రాణాం లగ్నాత్కేన్ద్రగతో యది**
**అరిష్టం నిఖిలం హన్తి తిమిరం భాస్కరో యథా 17**

బుధ గురు శుక్రులలో ఎవరైనను కేంద్రములోనున్న సూర్యుని ప్రకాశము వలన అంధకారము నష్టమగునట్లు జాతకుని బాలారిష్టము నష్టమగును.

**బలమైన గురువు వలన అరిష్టనాశము :–**

**ఏక ఏవ బలీ జీవో లగ్నస్థో రిపుసఞ్చయమ్**
**హన్తి పాపక్షయం భక్త్యా ప్రణామమివ శూలిన: 18**

గురుడొక్కడే బలవంతుడై లగ్నములోనున్న భగవానుడైన శివుడు ప్రణామము చేసిన పాపములను నశింపజేయునట్లు శత్రువులను సంహరించి పాపములను నశింపజేయును.

**లగ్నేశుని వలన అరిష్టభంగ యోగము :–**

**శుక్లపక్షే క్షపాజన్య లగ్నే సౌమ్యనిరీక్షితే**
**విపరీతం కృష్ణపక్షే తథారిష్ట వినాశన: 19**

శుక్లపక్షపు రాత్రిలో జన్మించినపుడు లగ్నములో శుభగ్రహ దృష్టియున్న అన్ని విధములైన అరిష్టములు నశించును. కృష్ణపక్షములో పగలు జన్మించిన లగ్నముపై పాపగ్రహదృష్టి యున్నప్పుడు కూడ అరిష్టములు తొలగును.

**ఉచ్ఛగ్రహముల వలన అరిష్ట భంగయోగములు :–**

**యస్య జన్మని తుఙ్గస్థా: స్వక్షేత్రస్తథా గ్రహా:**

**నిరామయం శిశుం జాతం కుర్వన్త్యష్టమగా యది 20**

ఉచ్చరాశిలో జాతకుని జన్మ సమయములో లేక స్వరాశిలో అష్టమభావములో గ్రహము లున్న జాతకుడు అరిష్టరహితుడగును.

**కశ్యప జాతకములో ద్వితీయాధ్యాయము సమాప్తము**

## 3. తృతీయాధ్యాయము

### లగ్నభావ ఫలాధ్యాయము

**లగ్నభావములో ద్వాదశవిధ ఫలము :-**

**స్వోచ్చే స్వోచ్చ నవాంశేచ శుభే వర్గేఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రగే సుహృదంశకే 1**
**రిభేర్యశే స్వర్క్షేద్వాదశ ధా క్రమాత్**
**ఫలఞ్చ తనుభావోత్థం కథ్తయే చ్యవనోదితమ్ 2**

లగ్నములోనున్న ఏగ్రహమైన 1.స్వోచ్చరాశి 2.స్వోచ్చనవాంశ 3.శుభవర్గము 4. నీచ రాశిగతము 5.నీచనవాంశగతము 6.క్రూరగ్రహ షడ్వర్గము 7.మిత్రరాశిగతము 8. మిత్ర నవాంశగతము 9. వర్గోత్తమగతము 10. శత్రురాశిగతము 11. శత్రునవాంశ గతము 12. స్వరాశి లేక స్వరాశి నవాంశగతమై ఫలమును చూపును.

ఈ విషయము చ్యవన వచన ఋషి వచనానుసారము తెలుపబడినది.

**విశేషము :-** చ్యవన ఋషి నామము జ్యోతిషశాస్త్రములో పద్దెనిమిది మంది ఆచార్యులలో తెలుపబడినది.కాని ప్రస్తుతము ఇతని గ్రంథములోని శ్లోకములు సంస్కృత వ్యాఖ్యానము లలో బృహద్దైవజ్ఞ రంజనాది గ్రంథములలో లభించుచున్నవి.నారద సంహితలో పద్దెనిమిదిమంది జ్యోతిషశాస్త్ర ప్రవర్తకులలో చ్యవనునినామము ప్రస్తావించ బడినది.ఈశ్లోకములో కశ్యపఋషి లగ్నగత భావగ్రహముల ఫలిత కథనము చ్యవనుని వచనానుసారము తెలియ జేసెను.దీనివలన జ్యోతిషశాస్త్రములో చ్యవనుని ఉన్నతస్థితిని మనము గ్రహించవచ్చును.

**గ్రహముల ఉచ్చాది స్థితుల గురించి వివరించబడుతున్నది :-**

**1. స్వోచ్చగ్రహము :-** సూర్యునికి మేషము, చంద్రునికి వృషభము, కుజునికి మకరము, బుధునికి కన్య,గురువుకి కర్కాటకము,శుక్రునికి మీనము,శనికి తుల,ఉచ్చరాశులగును.

**2. స్వోచ్చ నవాంశము :-** సూర్యుడు మేష నవాంశలో, చంద్రుడు వృషభ నవాంశలో, కుజుడు మకర నవాంశములో,బుధుడు కన్య నవాంశములో,గురువు కర్కాటక నవాంశములో,శుక్రుడు మీన నవాంశములో,శని తులా నవాంశములో ఉచ్చస్థితిని పొందును.

**3. శుభ వర్గము :–** గురు శుక్రులు శుభవర్గమగును. పూర్ణచంద్రుడు శుభయుక్తుడైన బుధుడు,పాపగ్రహరహితుడైన శుభసంజ్ఞకమగును.శుభగ్రహముల హోర, ద్రేక్కాణము, సప్తమాంశము, నవమాంశము, ద్వాదశాంశము, త్రింశాంశములలో అధిక శుభ గ్రహములున్న శుభవర్గములుగా తలంచవలెను.

**4. నీచరాశి గతము :–** సూర్యుడు తుల. చంద్రుడు వృశ్చికము, కుజుడు కర్కాటకము, బుధుడు మీనము, గురువు మకరము,శుక్రుడు కన్య, శని మేషరాశులలోనున్న నీచరాశి గతములుగా తెలుపబడెను.

**5. నీచాంశగతము :–** సూర్యుడు తులానవాంశము. చంద్రుడు వృశ్చిక నవాంశము, కుజుడు కర్కాటక నవాంశము, బుధుడు మీన నవాంశము, గురువు మకర నవాంశము, శుక్రుడు కన్య నవాంశము, శని మేష నవాంశములలోనున్న నీచరాశిగతమగును.

**6. క్రూరషడ్వర్గము :–** రవి కుజుడు శని ఇవి పాపగ్రహములుగా తెలుపబడెను. బుధుడు పాపగ్రహములతో కూడియున్న పాపగ్రహముగా భావించబడును. బుధుడు నపుంసకు డగును. అందువలన తనతో కూడియున్న శుభ పాపగ్రహముల ప్రభావము బుధునిపై పడును. పాపగ్రహ దృష్టి కలిగిన బుధుడు పాపిగా భావించవలెను. క్షీణచంద్రునికూడ పాపగ్రహముగా భావించవలెను. ఏదైన పాపగ్రహము హోర ద్రేక్కాణము సప్తమాంశ, నవమాంశ, ద్వాదశాంశ, త్రింశాంశలలోనున్న పాపగ్రహ వర్గములలోనుండుట వలన పాపగ్రహ షడ్వర్గముగా భావించవలెను.

**7. మిత్రగతము :–** ఏదైన గ్రహము నైసర్గికముగా తన మిత్రగ్రహరాశిలోనున్న అది మిత్రరాశిగతమగును.

**8. మిత్ర నవాంశగతము :–** మిత్ర గ్రహరాశి నవాంశములలో ఏదైన గ్రహమున్న అది మిత్రనవాంశగతమగును.

**9. వర్గోత్తమము :–** దీని విచారము రాశి నవాంశలు రెండింటితో నగును. ఏదైన గ్రహము ఒకే రాశి ఒకే నవాంశలోనున్న దానిని వర్గోత్తమమందురు. మేషరాశిలోనున్న గ్రహమునకు మేషరాశి నవాంశయైన, వృషభములో వృషభరాశి నవాంశము, అధే విధముగా మిగిలిన రాశులలో గ్రహములున్న వర్గోత్తమమగును.

**ఉదాహరణకు** ఏదైన గ్రహము మేషరాశిలో 3 అంశల 5 కలలపై నున్న మేషములో 3 అంశల 20 కలల వరకు మేషనవాంశమగుట వలన ఇది వర్గోత్తమమగును. ఇదే విధముగా మిగిలిన వాటిని గ్రహించవలెను.

**10.శత్రురాశి గతము :–** ఏదైన గ్రహము నైసర్గిక శత్రుగ్రహరాశిలో నున్న దానిని శత్రురాశిగతముగా భావించవలెను. ఉదాహరణకు రవికి శుక్ర శనులు శత్రువులు. అందు వలన వృషభ తుల మకర కుంభ రాశులలో సూర్యుడున్నశత్రురాశిగతమగును.

**11.శత్రు ననవాంశగతము :–** శత్రురాశి నవాంశములో ఏదైన గ్రహమున్న అదిశత్రు నవాంశ గతమగును.

**12. స్వక్షేత్ర గతము :–** రవికి సింహరాశి,చంద్రునికి కర్కాటకము, కుజునికి మేషము వృశ్చికము, బుధునికి మిథునము కన్య, గురునికి మీన ధనుస్సు:,శుక్రునికి తుల వృషభములు, శనికి మకర కుంభములు స్వక్షేత్రములగును.అందువలన ఏదైన గ్రహము తన స్వక్షేత్రములోనున్న అది స్వక్షేత్రగతమగును. స్వక్షేత్రమువలె స్వనవాంశకూడ అదే ఫలితము నిచ్చును.

**భావేశుని శుభాశుభ ఫలము :–**

**సఫలం విఫలం తచ్చ భావేశస్య బలాబలాత్**
**క్రూరేణ యుజ్యమానస్య విశేషాద్విఫలం వదేత్** 3
**ఏవం శుభఫలస్యోక్తో నిర్ణయో భావనాథత:**
**అశుభస్య క్షయస్తస్మిన్ సబలేఽపిబలే చయ:** 4

భావేశుడు బలవంతుడైన భావఫలము సఫలమగును. భావేశుడు నిర్బలుడైన భావఫలము నిష్ఫలమగును.శుభాభావముల ఫలితము భావేశుడు బలవంతుడైన పెరుగును.భావేశుడు నిర్బలుడైన తగ్గును. ఈవిధముగా భావ ఫలము భావేశుడు బలవంతుడైన వృద్ధి పొందును.భావేశుడు బలహీనుడైన క్షీణించును.

**విశేషము :–** శుభ భావేశుడు శుభుడైన అనుకూలమగును.అశుభ భావస్వామి నిర్బలుడైనను శుభము కలుగును.ఎందువలననగా అశుభఫలమునకు హాని, శుభ ఫలమునకు వృద్ధిని అందరు కోరుకుందురు.

**లగ్నములో సూర్యుని ద్వాదశవిధ ఫలము :–**

**తీవ్రో దృఢజ్గో వహ్వాశీ రోగీ లావణ్య వర్జిత:**
**అన్ధో దీర్ఘో ఽథ జటిలోఽధికాజ్గో హీన కాజ్గక:** 5
**దీన: స్యాన్నీతిరహిత: సూర్యే తనుగతే క్రమాత్**

1. లగ్నములో సూర్యుడు తన ఉచ్చరాశి (మేషం) గతుడైన జాతకుడు తీవ్ర స్వభావము కలవాడగును. ప్రతికార్యమును అతివేగముగాచేయును.
2. ఉచ్చనవాంశుడై సూర్యుడు లగ్నములోనున్న జాతకుని శరీరము దృఢముగా నుండును.
3. లగ్న సూర్యుడు శుభగ్రహవర్గములోనున్న అధికముగా భోజనము చేయువాడగును.
4. లగ్న సూర్యుడు నీచ (తుల) రాశిగతుడైన రోగగ్రస్తుడగును.
5. లగ్నస్థ సూర్యుడు నీచ నవాంశలోనున్న రూపలావణ్య హీనుడగును.
6. లగ్నస్థసూర్యుడు పాపగ్రహ వర్గములో నున్న జాతకుడు అంధుడగును.
7. లగ్నస్థ సూర్యుడు మిత్రరాశిలోనున్న పొడవైన శరీరము కలవాడగును.
8. మిత్రనవాంశలోనున్న జటిల స్వభావము కలవాడు లేక పొడవైన జడలు కలవాడగును.
9. వర్గోత్తమములోనున్న పెద్ద శరీరాంగములుండును.

10. శత్రురాశిలోనున్న చిన్న అంగములు కలవాడగును.

11. రాశి నవాంశలోనున్న జాతకుడు దీనుడగును.

12. లగ్నస్థ సూర్యుడు తనరాశిలో (సింహ)నున్న జాతకుడు నీతిరహితుడగును. ఏకార్యమును సక్రమముగా చేయడు.

**లగ్నస్థ చంద్రుని ద్వాదశ విధ ఫలము :-**

**పూర్ణో మనోహర: స్వచ్ఛ: క్షీణో రాత్రన్ధతాన్విత:** 6
**తిమిరాంశోఽతి సుభగ: సుముఖో రమ్య కేశక:**
**స్థూలస్యో దీర్ఘగుజ్నాస: శుభేష్ఠోఽబ్జే తనుస్థితే** 7

1. లగ్నస్థ చంద్రుడు ఉచ్చరాశిలో (వృషభము)నున్న జాతకుడు అన్ని కార్యములలో సఫలత్వమును పొందును. ప్రారంభించిన కార్యములను తప్పక పూర్తిచేయును.
2. లగ్నస్థ చంద్రుడు ఉచ్చరాశిలో నవాంశలో నున్న జాతకుడు అత్యంత సుందర రూపము కలవాడగును.
3. శుభగ్రహవర్గములో నున్న జాతకుడు శరీరమును వస్త్రములను శుభ్రముగా నుంచును. మనస్సు నిర్మలముగా నుండును.
4. నీచరాశిలో (వృశ్చికము) నున్న జాతకుడు ఎల్లప్పుడు నీచస్థితి పొందును.
5. నీచరాశి నీచనవాంశలో నున్న జాతకుడు రేచీకటి రోగముతో పీడితుడగును.
6. పాపగ్రహ వర్గములోనున్న జాతకుడు మందదృష్టి (తక్కువగా కనపడుట ) కలవాడగును.
7. మిత్రరాశిలో నున్న జాతకుడు అత్యంత సౌభాగ్యవంతుడగును.
8. మిత్రరాశి నవాంశలలోనున్న జాతకుడు సుందరమైన ముఖము కలవాడగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు సుందరమైన కేశము కలవాడగును.
10. శత్రురాశిలో నున్న జాతకుని ముఖము పెద్దదిగానుండును.
11. శత్రురాశి నవాంశలో నున్న జాతకుని నాసిక (ముక్కు) పొడవుగానుండును.
12. స్వక్షేత్రములో (కర్కాటకము) నున్న జాతకుడు ఎల్లప్పుడు శుభమును కోరును, అశుభ కార్యములను తలంచడు.

**లగ్నస్థ కుజ ద్వాదశ విధ ఫలము :-**

**రక్తనేత్రో చిపిట దృక్ కర్కశాక్షోఽన్ధతాయుత:**
**నక్తాన్ధస్తిమిరారోపో క్రూరదృక్ స్థూలలోచన:** 8
**నేత్రరోగీ దూరదర్శీ కుదృష్టి: సవిధేక్షణ:**
**జన్మానాఽదృక్ ఫలం భౌమే తనుభావ స్థితే క్రమాత్** 9

1. తనుభావములో నున్న కుజుడు ఉచ్చరాశిలో (మకరము)లో నున్న జాతకుని నేత్రములు రక్తవర్ణముతో నుండును.
2. ఉచ్చనవాంశలోనున్న జాతకుడు చిపిట దృష్టి కలవాడగును.
3. శుభరాశివర్గములో నున్న జాతకుని దృష్టి కఠోరమైనదగును. అతని చూపులో కాఠిణ్యము కనపడును.
4. నీచలో (కర్కాటకము)లో నున్న జాతకుడు దృష్టిహీనుడగును.
5. నీచరాశి నవాంశలో నున్న జాతకుడు రేచీకటి కలవాడగును.
6. పాపగ్రహవర్గములోనున్న జాతకుడు మందదృష్టి కలవాడగును.
7. మిత్రరాశిలో నున్న జాతకుడు క్రూరదృష్టి కలవాడగును.
8. మిత్రనవాంశలో నున్న జాతకుడు పెద్ద నేత్రములు కలవాడగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు నేత్రరోగ పీడితుడగును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు దూరదృష్టి (దూరము వరకు చూచువాడు, దూరాలోచన చేయువాడు) కలవాడగును.
11. శత్రు నవాంశలో నున్న జాతకుని దృష్టి కుశలముగానుండును.
12. స్వరాశిలో (మేషము వృశ్చికము) లోనున్న జాతకుడు హ్రస్వదృష్టి కలవాడగును.

**లగ్నస్థ బుధ ద్వాదశ విధ ఫలములు :-**

**స వక్ర నాసికాయుక్త: సులమ్బోష్టస్తు కాన్తిమాన్**
**దుర్గన్ధస్థో దీర్ఘజిహ్వో దీర్ఘ కర్ణోఽసితాలక: 10**
**శుభకణ్ఠోఽతి సుభగ: కరాల: చపల: తథా**
**మేదో వృద్ధయతి పుష్టాఙ్గో బుధేస్యాత్తనుభావగే 11**

1. జన్మలగ్నములో బుధుడు ఉచ్చరాశిలోనున్న నాసిక వంకరగానుండును.
2. ఉచ్చరాశి నవాంశలోనున్న జాతకుని పెదవి పొడవుగానుండును.
3. శుభగ్రహవర్గములో నున్న జాతకుని శరీరము కాంతివంతముగానుండును.
4. నీచరాశిలోనున్న జాతకుడు దుర్గంధముతో కూడియుండును.
5. నీచరాశి నవాంశలోనున్న జాతకుని నాలుక పొడవుగానుండును.
6. పాపషడ్వర్గములో నున్న జాతకుడు చెవిపెద్దదిగానుండును.
7. మిత్రనవాంశలోనున్న జాతకుని కంఠము సుందరముగా నుండును.
8. మిత్రనవాంశలో నున్న జాతకుని అరచేతులు కత్తివలె దృఢముగానుండును.
9. వర్గోత్తమ నవాంశములో నున్న జాతకుడు అత్యంత సౌభాగ్యవంతుడగును.
10. శుభగ్రహరాశిలోనున్న జాతకుని దంతములు భయమును కలిగించును.

11. శత్రురాశి నవాంశములోనున్న జాతకుడు చపలచిత్తము కలవాడై లావుగా నుండును.

12. స్వరాశిలో (కన్య మిథునము)నున్న జాతకుని శరీరము అధికలావుగా నుండును.

**లగ్నస్థ గురు ద్వాదశవిధ ఫలము :-**

**సున్దర: సున్దరకర: సుకూర్చో రోగవర్జిత:**
**సుజ్ఞ; సుభూష: సద్వస్త్ర: సునాభి కఠియుత సంయుత: 12**
**శుభోరు: క్రోడరోగీ చ పాణ్డురోగ సమన్విత:**
**సులిఙ్గతాని సౌభాగ్య సంయుత: తనుగే గురౌ 13**

1. లగ్నస్థ గురుడు ఉచ్చరాశిలోనున్న జాతకుడు సుందర శరీరము కలవాడగును.
2. తన ఉచ్చ నవాంశలోనున్న జాతకుడు సుందరుడగును.
3. శుభగ్రహవర్గములో నున్న జాతకుని గడ్డము సుందరముగా నుండును.
4. నీచరాశి (మకరము)లోనున్న జాతకుడు రోగరహితుడగును
5. నీచ నవాంశలోనున్న జాతకుడు విద్వాంసుడగును.
6. పాపగ్రహ వర్గములో నున్న జాతకుడు సుందరమైన భూషణములు, వస్త్రములు ధరించువాడగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు మంచి వస్త్రము ధరించువాడగును.
8. మిత్రనవాంశలో నున్న జాతకుని నాభి సుందరముగానుండును.
9. వర్గోత్తమ నవాంశములో నున్న జాతకుని ఛాతి శుభలక్షణములతో కూడియుండును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు హృదయ రోగము కలవాడగును.
11. శత్రు నవాంశములోనున్న జాతకుడు పాండు రోగియగును.
12. స్వరాశిలో (ధను మీనరాశి)నున్న జాతకుడు శుభలక్షణములు కలిగి సౌభాగ్య వంతుడగును.

**లగ్నస్థ శుక్ర ద్వాదశవిధ ఫలము :-**

**స్వాస్య జాను: సుకరపా ద్విభక్తాజ్గో ల్పకేశక:**
**ఖల్వాటో బహు కేశాఢ్యో రోగాఢ్యో కాన్తసౌభాగ్యసంయుత: 14**
**సుముఖశ్చ సురూపశ్చ కుబ్జో పిగన్ధవాన్**
**నేత్రాభరామో భృగుజే క్రమేణ తనుభావగే 15**

1. లగ్నస్థ శుక్రుడు ఉచ్చరాశి (మీనము)లోనున్న జాతకుడు ముఖము మోకాళ్ళు సుందరముగా నుండును.
2. తన స్వోచ్చ నవాంశలోనున్న జాతకుడు కాళ్లు చేతులు సుందరముగా నుండును.
3. శుభగ్రహవర్గములో నున్న జాతకుని శరీరాంగములు సముచితముగా నుండును.

4. నీచరాశి (కన్య) లో నున్న జాతకుని కేశములు స్వల్పముగా నుండును.
5. నీచ నవాంశలోనున్న జాతకుని శిరస్సుపై కేశములుండవు.
6. పాపగ్రహ వర్గములో నున్న జాతకుడు అనేక రోగములతో కూడియుండును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని శరీరము సుందరముగా నుండును.
8. మిత్ర గ్రహ నవాంశలో నున్న జాతకుని ముఖము సుందరముగానుండును.
9. వర్గోత్తమములో నున్న జాతకుడు రూపవంతుడగును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు పొట్టివాడగును.
11. శత్రు నవాంశములోనున్న జాతకుని శరీరము దుర్గంధము కలిగిఉండును.
12. స్వరాశిలో (వృషభము తుల)నున్న జాతకుని నేత్రములు సుందరముగా నుండును.

**లగ్నస్థ శని ద్వాదశ విధ ఫలము :-**

**శ్యామవర్ణో భిన్నవర్ణో భిన్నాఙ్గో భ్రమ కాశవాన్**
**కఫానిలాఢ్య: పిత్తాఢ్యో గౌర: సతతరోగాఽస్థివాన్** **16**
**పీవర: స్థూల నఖతా సూక్ష్మతాభ్యాం సమన్విత:**
**స్థూలదన్తో దీర్ఘజాను: శనౌ స్యాత్తనుభావగే** **17**

1. లగ్నస్థ శని ఉచ్చరాశి (తుల)లోనున్న జాతకుడు శ్యామవర్ణము కలవాడగును.
2. తన స్వోచ్చ నవాంశలోనున్న జాతకుని శరీరము భిన్నమైన వర్ణములతో నుండును. శరీరము వివిధ రంగులతో కూడియుండును.
3. శుభగ్రహవర్గములో నున్న జాతకుడు భిన్నాంగములు కలవాడగును. అతని శరీరములో సంధులు బలహీనముగానుండి వేరువేరుగా కనపడును.
4. నీచరాశిలో నున్న జాతకుని తల తిరుగుతు ఉండును. తరచు దగ్గు వచ్చుచుండును.
5. నీచ రాశి (మేషం) నవాంశలోనున్న జాతకుడు కఫ వాతరోగములతో పీడితుడగును.
6. పాపగ్రహ షడ్వర్గులో నున్న జాతకునిశరీరములో పిత్తజనిత వికారముండును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు గౌరవర్ణముతో నుండును.
8. మిత్ర నవాంశలో నున్న జాతకుడు అస్థి (ఎముక) రోగముతో పీడితుడగును.
9. వర్గోత్తమములో నున్న జాతకుడు స్థూలశరీరము కలవాడగును.
10. శత్రురాశిలోనున్న జాతకుని నఖములు లావుగా నుండును.
11. శత్రు నవాంశములోనున్న జాతకుని దంతములు పెద్దవిగానుండును.
12. లగ్నస్థ శని స్వరాశిలో (మకర కుంభ) నున్న జాతకుని మోకాళ్ళు పొడవుగా నుండును.

## లగ్నములోనున్న గ్రహముల ద్వాదశ విధ ఫలప్రదర్శన చక్రము

| గ్రహముల | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 |
|---|---|---|---|---|---|---|---|
| ద్వాదశ స్థితులు | రవి | చంద్ర | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
| 1 స్వోచ్ఛగత | తీవ్ర | పూర్ణ | రక్తతంత్ర | వక్రనాస | సుందర | సుముఖ | శ్యామవర్ణ |
| 2 స్వోచ్ఛ న వాంశ గత | దృఢాంగ | మనో హర | చిపిట | లంబోష్ఠ | సుందర | సుకరపా | భిన్నవర్ణ |
| 3 శుభవర్గగత | బహు భోగి | స్వచ్ఛ | కర్కశాక్షి | కాంతి మాన్ | సుకూర్చ | ద్విభక్తాంగ | భిన్నాంగ |
| 4 నీచరాశిగత | రోగి | క్షీణ | అంధత | దుర్గంధ | రోగహీన | అల్పకేశక | భ్రమక |
| 5 నీచ నవాంశ గత | రూప హీన | నక్తాంధ్య | నక్తాంధ్య | దీర్ఘజిహ్వ | సుజ్ఞ | ఖాల్వాట | కఫవాత రోగి |
| 6 పాపషడ్వర్గ గత | అంధ | మంద దృష్టి | తిమిర | దీర్ఘకర్ణ | సుభూష | బహురోగి | పిత్తాఢ్య |
| 7 మిత్రరాశి గత | అధి కాంగ | అతి సుభగ | క్రూరదృష్టి | అసిసాలక | సువస్త్ర | కాంతి మాన్ | గౌరవర్ణ |
| 8 మిత్ర నవాంశ గత | జటిల | సుముఖ | స్థూల లోచన | శుభ్రకంఠ | సునాభి | సుముఖ | అస్థిరోగి |
| 9 వర్గోత్తమగత | అధి కాంగ | రమ్య కేశక | నేత్రరోగి | అధిక సుభగ | శుభోరు | సురూప | పుష్టశరీర |
| 10 శత్రురాశి గత | హీనాంగ | స్థూల ముఖ | దూరదృష్టి | కరాల | క్రోడరోగి | కుబ్జ | స్థూలనఖి |
| 11 శత్రు నవాంశ గత | దీన | దీర్ఘ నాసిక | కుదృష్టి | చపల | పాండు రోగి | దుర్గంధ | స్థూల దంత |
| 12 స్వరాశిగత | నీతి రహిత | శుభా కాంక్ష | హ్రస్వ దృష్టి | మేదో వృద్ధి | సౌభాగ్య వాన్ | సునేత్ర | దీర్ఘజాను |

**కశ్యప జాతకములో తృతీయాధ్యాయము సమాప్తము**

# 4. చతుర్థాధ్యాయము

## ద్వితీయ భావ ఫలాధ్యాయము

**గ్రహముల ద్వాదశ స్థితుల కథనము :-**

**స్వోచ్ఛే స్వోచ్ఛ నవాంశే చ శుభవర్గేఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రభే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరి భేర్యంశే స్వర్క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలఞ్చ ధన భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

లగ్నములోనున్న ఏగ్రహమైన 1. స్వోచ్ఛరాశి 2. స్వోచ్ఛ నవాంశము 3. శుభ వర్గము 4. నీచరాశిగతము 5. పాపగ్ర షడ్వర్గము 7. మిత్రరాశిగతము 8. మిత్ర నవాంశ గతము 9. వర్గోత్తమము 10. శత్రురాశి 11. శత్రునవాంశము 12. స్వరాశిగత మైన గ్రహములు ఫలితము నిచ్చును. ఇది చ్యవనఋషి మతము.

**ద్వితీయభావస్థిత సూర్యుని ద్వాదశవిధ ఫలము :-**

**విత్తం నృపతి మానోత్థం నృప సేవాసముద్భవమ్**
**సులోకదక్షం పాపోత్థం స్థూలజం చౌర్యసమ్భవమ్ 3**
**కామాల్లోభాత్ పరస్త్రీత: స్వల్పం చాధమ సేవనాత్**
**భృత్యజంధన భావస్థే భాస్కరే లభతే నర: 4**

1. ద్వితీయభావములో సూర్యుడు ఉచ్చరాశిలో నున్న జాతకుడు రాజసమానుడు, ధనవంతుడగును.
2. ఉచ్ఛ నవాంశలో సూర్యుడున్న రాజసేవ వలన ధనవంతుడగును.
3. శుభగ్రహ షడ్వర్గులోనున్న సులోక (సుఖవంతమైన కార్యస్థలము లేక నివాసస్థల జలము)లో సమర్థమైన కార్యము చేయుట వలన ధనము లభించును.
4. నీచరాశిలో సూర్యుడున్న పాపకార్యము వలన ధనము లభించును.
5. నీచనవాంశలో నున్న అధికమైన శారీరక శ్రమ వలన ధనము లభించును.
6. పాపషడ్వర్గులోనున్న దొంగతనము చేయుట వలన ధనము లభించును.
7. మిత్రరాశిలో నున్న కామకలాపము వలన ధనము లభించును.
8. మిత్రనవాంశలోనున్న లోభయుక్తమైన కార్యము చేయుట వలన ధనము లభించును.
9. వర్గోత్తమములోనున్న పరస్త్రీ వలన ధనము లభించును.
10. శత్రురాశిలోనున్న స్వల్పధనము కలుగును.
11. శత్రునవాంశలో నున్న నీచుల వలన ధనము లభించును.
12. స్వరాశిలో (సింహ)లో నున్న సేవకుని వలన ధనము లభించును.

**ద్వితీయభావస్థిత చంద్రుని ద్వాదశవిధ ఫలము :-**

**రక్తయుక్తే హేమరఏష్యే స్వర్ణంధర్మేతర వ్యయమ్**
**వ్యయహీనం పాపభావం సూతజం కృషి సమ్భవమ్** 5
**సుహృద్ దుర్జనజం చౌర్యం సమ్భవే హీన కర్మజమ్**
**పూర్వోపార్జితం చన్ద్రే ధనభావగతే ధనమ్** 6

1. జన్మ కుండలిలో ధనభావములో చంద్రుడు ఉచ్చరాశిలో నున్న జాతకుడు మాణిక్యము వలన ధనమును పొందును.
2. ఉచ్చ నవాంశలో చంద్రుడున్న రౌర్యరూపముతో ధనమును పొందును.
3. శుభగ్రహ వర్గములోనున్న సువర్ణము వలన ధనము లభించును.
4. నీచరాశిలో చంద్రుడున్న జాతకుని ధనము వ్యర్థకార్యములలో ఖర్చగును.
5. నీచనవాంశలో నున్న వ్యయము కలుగదు. ఇతరులనాశ్రయించి జీవించును.
6. పాప గ్రహవర్గులోనున్న పాపకార్యముల వలన ధనము పొందును.
7. మిత్రరాశిలోనున్న సూతకార్యము (వాహనములు నడుపుట) వలన ధనము లభించును.
8. మిత్రనవాంశలోనున్న వ్యవసాయము వలన ధనము లభించును.
9. వర్గోత్తమములోనున్న సజ్జన దుర్జనుల వలన ధనము లభించును.
10. శత్రురాశిలోనున్న దొంగతనము చేయుట వలన ధనము కలుగును.
11. శత్రునవాంశలో నున్న నీచ కార్యముల వలన ధనము లభించును.
12. స్వరాశిలో చంద్రుడున్న పూర్వులార్జించిన ధనముతో జీవించును.

**ద్వితీయభావస్థిత కుజ ద్వాదశవిధ ఫలము :-**

**యుద్ధజం కోష్ఠజం కృష్యం సుజనోత్థం ధనోర్జితమ్**
**ఋణం త్యజిత దేశర్ణం మిత్రవఞ్చన సమ్భవమ్** 7
**సుహృద్ వఞ్చన సమ్భూతం గురుదేవాది మోక్షజం**
**నైశ్వం స్వజన విద్వేషాద్ విత్తం భౌమే ధనేస్థితే** 8

1. ద్వితీయభావములో ఉచ్చరాశిలో కుజుడున్న యుద్ధము చేయుట వలన ధనమును లభించును.
2. ఉచ్చ నవాంశలో కుజుడున్న అన్నభాండారము వలన ధనము లభించును.
3. శుభ షడ్వర్గములోనున్న వ్యవసాయము వలన ధనము ప్రాప్తించును.
4. నీచరాశిలో నున్న సజ్జనుల వలన ధనము లభించును.
5. నీచనవాంశలో నున్న ధనమును వడ్డీకి ఇచ్చుట వలన ధనము వృద్ధిపొందును.
6. పాప గ్రహ షడ్వలోనున్న అప్పు ఇచ్చుట వలన ధనము వృద్ధి పొందును.
7. మిత్రరాశిలోనున్న దివాళాతీయుట వలన ధనము వృద్ధి పొందును.
8. మిత్రనవాంశలోనున్న మిత్రుని మోసము చేయుట వలన ధనము వృద్ధి పొందును.

9. వర్గోత్తమములోనున్న బంధు జనులను మోసము చేయుటవలన ధనము లభించును.
10. శత్రురాశిలోనున్న మృత్యువు తర్వాత ధనము కలుగును.
11. శత్రునవాంశలో నున్న ధనహీనుడగును.
12. స్వరాశి (మేష,వృశ్చికం)లో కుజుడున్న స్వజనులను ద్వేషించుట వలన ధనము వృద్ధి పొందును.

**ద్వితీయభావస్థిత బుధ ద్వాదశవిధ ఫలము :-**

**భూధనం సస్య పశుజం బహుపాపసముద్భవమ్**
**నిష్కృష్టతా సముద్భూతం దైన్యార్జిత రిపూద్భవమ్** 9
**వఞ్చనోత్థం వాజి భవం కృషిజం కృషిసమ్భవమ్**
**శత్రుసేవాభవం స్వల్పం శ్రేష్ఠ లోకాద్‌బుధే స్వగే** 10

1. జన్మ కుండలిలో ధనభావములో బుధుడు ఉచ్చరాశిలో నున్న భూమినుండి ఉత్పన్నమగు వస్తువుల వలన ధనమును పొందును.
2. ఉచ్చ నవాంశలో బుధుడున్న జాతకుడు పశుధనము వలన సమృద్ధి పొందును.
3. శుభరాశి వర్గములోనున్న పాపకర్మల వలన ధనము లభించును.
4. నీచరాశిలోనున్న మర్యాదరహితమైన కార్యములు చేయుట వలన ధనమును పొందును.
5. నీచనవాంశలో నున్న శత్రువు ఎదుట దీనభావముతో నుండుట వలన ధనము లభించును..
6. పాప గ్రహవర్గులోనున్న ఇతరులను మోసము చేయుటవలన వలన ధనము లభించును.
7. మిత్రరాశిలో నున్న వ్యవసాయము వలన ధనము లభించును.
8. మిత్రనవాంశలోనున్న వాహన సంచాలనము వలన ధనము లభించును.
9. వర్గోత్తమములోనున్న వ్యవసాయము వలన ధనము లభించును.
10. శత్రురాశిలోనున్న శత్రువులను సేవించుట వలన ధనము ప్రాప్తించును.
11. శత్రునవాంశలో నున్న స్వల్పమాత్రముగా ధనము లభించును.
12. స్వరాశిలో (మిథున కన్య) లో బుధుడున్న అనుకూల స్థలములో పనిచేయుట వలన ధనము లభించును.

**ద్వితీయభావస్థిత గురు ద్వాదశవిధ ఫలము :-**

**విత్తం న్యాయార్జితం విప్ర సాదుదత్తం క్షితీశజమ్**
**పరదార సముద్భూతమన్యజోత్థం కాష్ఠజమ్** 11
**రాజశ్వ వస్త్ర సమ్భూతం కృషిజాం స్వజమార్పితమ్**
**రిపుదాస్యాద్ దరిద్రాప్తం విధిజం ధనగే గురౌ** 12

1. ద్వితీయభావములో గురువు ఉచ్చరాశిలో నున్న జాతకుడు న్యాయముగా సంపాదించిన ధనముతో జీవించును.
2. ఉచ్చ నవాంశలో నున్న బ్రాహ్మణుల సాధువుల వలన ధనమును పొందును.
3. శుభగ్రహ వర్గములోనున్న రాజుల వలన ధనము లభించును.
4. నీచరాశిలో గురువున్న స్త్రీవలన ధనము ప్రాప్తించును.
5. నీచనవాంశలో నున్న నీచకర్మ చేయుట వలన ధనము లభించును.
6. పాప గ్రహవర్గులోనున్న కాష్ఠాదుల వలన ధనము ప్రాప్తించును.
7. మిత్రరాశిలో నున్న గజాశ్వాది వాహనముల వలన ధనము లభించును. అనగా యాత్రా సాధనముల వలన ధనము లభించును.
8. మిత్రనవాంశలోనున్న వ్యవసాయము వలన ధనము లభించును.
9. వర్గోత్తమములోనున్న స్వజనుల వలన ద్రవ్యము ప్రాప్తించును.
10. శత్రురాశిలోనున్న శత్రువులద్వారా ధనము ప్రాప్తించును.
11. శత్రునవాంశలో నున్న దరిద్ర జనుల వలన ధనము లభించును.
12. స్వరాశిలో గురుడున్న జాతకుడు విధి (జమచేసిన) ధనము ప్రాప్తించును.

**ద్వితీయ భావస్థ శుక్ర ద్వాదశభావ ఫలము :-**

**విత్తం క్షీణ బహులం పూర్వజాతం క్షితీశజమ్**
**కార్పణ్యజం ద్యూతలబ్ధం పరదేశాతి సజ్జజమ్** 13
**నృపజం నృపపుత్రోత్థం రాజజం వరకర్మజమ్**
**దైన్యజం పుత్రజనితం శుక్రే ధనగతే క్రమాత్** 14

1. ద్వితీయభావములో ఉచ్చరాశిలో శుక్రుడున్న జాతకుడు ధనము ఎల్లప్పుడు కలిగి యుండును. అవసరమునకు ధనముండును..
2. ఉచ్చ నవాంశలో శుక్రుడున్న జాతకుడు పూర్వీకుల ధనము వలన జీవించును.
3. శుభగ్రహ షడ్వర్గులోనున్న రాజుల వలన ధనము లభించును.
4. నీచరాశిలో గురువున్న కార్పణ్యము (లోభితనము) వలన ధనము పొందును.
5. నీచనవాంశలో నున్న ద్యూతము వలన ధనము లభించును.
6. పాప గ్రహవర్గులోనున్న పరదేశములో ఉండుట వలన వలన ధనము ప్రాప్తించును.
7. మిత్రరాశిలో నున్న రాజుల వలన ధనము ప్రాప్తించును.
8. మిత్రనవాంశలోనున్న రాజపుత్రుల వలన ధనము ప్రాప్తించును.
9. వర్గోత్తమములోనున్న రాజకీయ కోశాగారము వలన ద్రవ్యము ప్రాప్తించును.
10. శత్రురాశిలోనున్న ఉత్తమకార్యములు చేయుట వలన ధనము ప్రాప్తించును.
11. శత్రునవాంశలో నున్న దీనత్వము ప్రదర్శించుట వలన ధనము లభించును.
12. స్వరాశిలో గురుడున్న జాతకుడు పుత్రుల వలన ధనము పొందును.

**ద్వితీయ భావస్థిత శని ద్వాదశ విధ ఫలము :-**

**విత్తం కుకర్మ జాతల్పం కష్టజం వ్యసనోద్ భవమ్**
**దు:ఖ నిర్ఘృణతాక్లేశమన్త్యజోత్థఞ్చ పాపజమ్** 15
**అస్థిస్వం మృణ్యయం చైవ జలజం పాపమేవచ**
**దాస్యజం పరమోషోత్థం శనౌ ధన గతో భవేత్** 16

1. ద్వితీయభావములో శని ఉచ్చరాశిలో నున్న జాతకుడు చెడుపనులు చేయుట వలన అల్పధనమును పొందును.
2. ఉచ్చ నవాంశలో శని ఉన్న కష్టముతో ధనము లభించును.
3. శుభవర్గములోనున్న జాతకుడు వ్యసనముల(జూదములు)వలనధనమును పొందును.
4. నీచరాశిలో దు:ఖముతో కూడిన పనిచేయుట వలన ధనము లభించును.
5. నీచనవాంశలో నున్న అంత్యజుల కార్యములు చేయుట వలన ధనము లభించును.
6. పాప గ్రహ వర్గములోనున్న పాపకర్మల వలన ధనము ప్రాప్తించును.
7. మిత్రరాశిలో నున్న అస్థులతో (ఏనుగు దంతములతో) ధనము సంపాదించును.
8. మిత్రనవాంశలోనున్న మట్టిపాత్రల వలన ధనము లభించును.
9. వర్గోత్తమములోనున్న జలీయ(జలమునుండి పుట్టిన)పదార్థములతోధనము లభించును.
10. శత్రురాశిలోనున్న పాపకర్మల వలన ధనము ప్రాప్తించును.
11. శత్రునవాంశలో నున్న సేవకావృత్తి వలన ధనము లభించును.
12. స్వరాశిలో శనియున్న జాతకుడు ఇతరులను మోసము చేయుట వలన ధనమును సంపాదించును.

**ద్వితీయభావ స్థిత సూర్యాది గ్రహములు ఉచ్చలోనున్న ధనమునిచ్చు శక్తి :-**

**సహస్రముచ్చగా సూర్యో లక్షమిన్దు శతం కుజ:**
**బుధల కోటిం గురు: ఖర్వ శుక్ర: శఙ్ఖం శనిశతమ్** 17
**దద్యురత్యుచ్చగా: ఖేటాస్తతో న్యూనం క్రమాత్ ధనమ్**
**నిజ స్థానాను రూపఞ్చ స్వదశాసు యథోదితమ్** 18

1. ద్వితీయభావములో ఉచ్చరాశిలో సూర్యుడున్న లేక పరమోశ్చలోనున్న సహస్రపతి యగును.
2. ధనభావములో ఉచ్చలోనున్న చంద్రుడు లక్షాధికారియగును.
3. కుజుడు పరమోశ్చలోనున్న (మకరం 27వ అంశ)నున్న శతాధీశుడగును.
4. బుధుడు పరమోశ్చలో నున్న (కన్య 15వ అంశ)కోటీశ్వరుడగును.
5 గురువు పరమోశ్చలో నున్న ఖర్వాదిపతి యగును.
6. శుక్రుడు పరమోశ్చలో నున్న శంఖపతి యగును.
7. ద్వితీయభావములో పరమోశ్చలో శనియున్న శతాధీశుడగును. ఇది ఆయాగ్రహము ల దశలలోనగును.

## గ్రహముల ద్వాదశస్థితి ఫలప్రదర్శక చక్రము (ధనప్రాప్తి)

| గ్రహములు ద్వాదశస్థితి | 1 రవి | 2 చంద్ర | 3 కుజుడు | 4 బుధుడు | 5 గురువు | 6 శుక్రుడు | 7 శని |
|---|---|---|---|---|---|---|---|
| 1 ఉచ్చ | రాజమానము వలన | ముత్యము మాణిక్యము | యుద్ధము | భూధనము | న్యాయము | అక్షీణ ధనము | కుకర్మ వలన |
| 2 ఉచ్చ నవాంశ | రాజసేవ వలన | వెండి బంగారము | కోశాగారము | వ్యవసాయము | విప్రాదులు | పూర్వజులు | కష్టము |
| 3 శుభ వర్గము | దక్షతా పూర్ణకార్య | స్వర్ణము | వ్యవసాయము | పాప ధనము | రాజు | రాజు | వ్యసనము |
| 4 నీచరాశి | నీచకర్మ వలన | వ్యయ హీనము | సుజనులు | నికృష్ట ధనము | పరస్త్రీలు | కృపణత | నిర్దయ కర్మ |
| 5. నీచ నవాంశము | నీచకర్మ వలన | వ్యయహీనము | ఊర్జితము | భిక్షాటనము | అంత్యజులు | ద్యూతము | అంత్యజులు |
| 6. పాప వర్గము | దొంగతనము వలన | పాపకర్మ | ఋణత్వము | మోసము | కష్టము | ప్రవాసము | పాపము |
| 7 మిత్రరాశి | కర్మ వలన | సూత క్రియ | దేశ త్యాగము | వాహనము | వాహనము | రాజు | అస్థి |
| 8 మిత్ర నవాంశ | లాభము వలన | వ్యవసాయము | మిత్ర వంచనము | వ్యవసాయము | వ్యవసాయము | రాజ పుత్రులు | మృత్తిక |
| 9 వర్గోత్తమము | పరస్త్రీ వలన | దుర్జనులు | సుహృద్ వంచనము | వ్యవసాయము | స్వజనులు | రాజు | జల జన్యము |
| 10 శత్రురాశి | స్వల్ప మాత్రము | దొంగ తనము | గురువు | శత్రు సేవ | శత్రువుల వలన | శ్రేష్ఠ కర్మ | పాపము |
| 11 శత్రు నవాంశ | నీచకర్మ వలన | హీన కర్మ | నిర్ధనత | స్వల్ప ధనము | దరిద్రము | దీనత్వము | దాసత |
| 12 స్వరాశి | సేవక వృత్తి వలన | పూర్వోపార్జితము | స్వజనము | శ్రేష్ఠ లోకము | నిధి | పుత్రులు | పర వంచన |

**కశ్యప జాతకములో చతుర్థాధ్యాయము సమాప్తము**

# 5. పంచమాధ్యాయము

## తృతీయభావ ఫలాధ్యాయము

**గ్రహముల ద్వాదశస్థ ఫల కథనము :**

**స్వోచ్ఛే స్వోచ్ఛనవాంశే వా శుభవర్గోఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రభే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరిభేర్యంశే స్వర్‌క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలం సహజ భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

1. స్వోచ్ఛ 2. స్వోచ్ఛనవాంశము 3. శుభవర్గము 4. నీచరాశిగతము 5. నీచనవాంశ గతము 6. క్రూర షడ్వర్గము 7. మిత్రరాశి గతము 8. మిత్ర నవాంశగతము 9. వర్గోత్తమము 10. శత్రురాశి గతము 11. శత్రు నవాంశ గతము 12. స్వక్షేత్రము ఈవిధముగా పన్నెండు విధములైన స్థితులలోనున్న గ్రహముల ఫలితములను చ్యవన మహర్షి తెల్పిన విధముగా తెలియజేయబడుతున్నది.

**గ్రహశీల చక్రము**

| గ్రహము | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| స్వరాశి | సింహ | కర్కాటక | మేష వృశ్చిక | కన్య మిథున | ధను మీన | వృషభ తుల | మకర కుంభ |
| ఉచ్ఛ | మేష | వృషభ | మకర | కన్య | కర్కాట | మీన | తుల |
| పరమోచ్ఛ | 10 | 3 | 27 | 15 | 5 | 28 | 20 |
| నీచ | తుల | వృశ్చిక | కర్కాట | మీనం | మకర | కన్య | మేషం |
| పరమనీచ | 10 | 3 | 27 | 15 | 5 | 28 | 20 |
| నైసర్గిక మిత్రగ్రహ | చం కుజ | రవి చం గు | రవి చం గు | రవి శు రా | రవి చం కు | బుధ శ రా | బుధ శు రా |
| నైసర్గిక సమగ్రహ | బు | కు శ | శు గు | కు శ | శ గు | కు రా | గు |
| నైసర్గిక శత్రుగ్రహ | శు | రా శ | బు రా కు | చం | బుధ శుక్ర | రవి చం | రవి చం |
| ఏకపాదదృష్టి | 3, 10 | 3,10 | 3,10 | 3,10 | 3,10 | 3,10 | 3,10 |
| ద్విపాదదృష్టి | 5,9 | 5,9 | 5,9 | 5,9 | 5,9 | 5,9 | 5,9 |
| త్రిపాదదృష్టి | 4,7 | 4,7 | 4,7 | 4,7 | 4,7 | 4,7 | 4,7 |
| పూర్ణదృష్టి | 7 | 7 | 4,7,8 | 7 | 5,7,9 | 7 | 3,7,10 |

| గ్రహము | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| లింగము | పురుష | స్త్రీ | పురుష | నపుంస | పురుష | స్త్రీ | నపుంస |
| గ్రహరత్నము | మాణిక్య | ముత్యము | పగడము | పచ్చ | పుష్య రాగము | వజ్రము | నీలము |
| గ్రహ సమిధి | అర్కము | పలాశము | ఖదిర | అపామార్గ | అశ్వర్థము | మేడి | శమీ |
| గ్రహధాన్యము | గోధుమ | బియ్యము | కందులు | పెసలు | శనగలు | ఉలవలు | నువ్వులు |
| గ్రహపుష్పము | ఎర్ర కమలం | శ్వేత పుష్పము | ఎర్ర గన్నేరు | అన్ని పుష్పములు | పీత పుష్పము | శ్వేత పుష్పము | నీలి పుష్పము |
| గ్రహపురంగు | రక్తము | శ్వేతము | ఎరుపు | పచ్చ | పీతము | శ్వేతము | నీలము |
| గ్రహజాతి | క్షత్రయ | వైశ్య | క్షత్రియ | వైశ్య | బ్రాహ్మణ | బ్రాహ్మణ | శూద్ర |
| గ్రహదిశ | పూర్వ | వాయవ్య | దక్షిణ | ఉత్తర | ఈశాన్య | ఆగ్నేయ | పశ్చిమ |
| స్థిరకారకులు | పిత్రు | మాతృ | భాతృ | జాతి | పుత్ర | స్త్రీ | భృత్య |
| గ్రహమంత్ర జపసంఖ్య | 6వేలు | 10వేలు | 7వేలు | 17వేలు | 16వేలు | 20వేలు | 19వేలు |
| అవస్థ | ప్రౌఢ | యువ | యువ | యువ | వృద్ధ | యువ | అతివృద్ధ |
| దేవత | అగ్ని | వరుణ | స్కంద | విష్ణు | ఇంద్ర | శచి | బ్రహ్మ |
| రసస్వాదులు | తిక్త | క్షార | కటు | సర్వరస | మధుర | ఆమ్ల | కషాయ |

**తృతీయభావగత రవి ద్వాదశవిధ ఫలము :-**

**రాజారాజసుత: సార్వభౌమ నీచస్తథైవ చ**
**భిక్షు కోఽ_గ్ర విరోధశ్చ చారణో బ్రాహ్మణస్తథా** 3
**కులీన: శాస్త్రవిద్ వైరిక్షతాజ్ఞో నిర్గుణ: సమ:**
**రవౌ సహజే భావస్థే క్రమాదేతద్ వధేత్సుధీ:** 4

1. జన్మ సమయములో తృతీయభావములో సూర్యుడుచ్చలోనున్న జాతకుడు రాజసమానమైన ప్రతిభాశాలి యగును.
2. ఉచ్చనవాంశలోనున్న యువరాజ సమానమగా ప్రతిభావంతుడగును.
3. శుభగ్రహ వర్గములోనున్న సార్వభౌముడగును.
4. నీచరాశిలోనున్న దుష్టప్రకృతి కలవాడగును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు భిక్షాటనము చేయును.
6. పాపగ్రహ షడ్వర్గములోనున్న అందరితో విరోధము కలిగి ఉండును.

7. మిత్రరాశిలోనున్న చారణుడగును,
8. మిత్ర నవాంశలోనున్న అతని వ్యవహారము బ్రాహ్మణుని వలె నుండును.
9. వర్గోత్తమములోనున్న ఉన్నత కులములో పుట్టినవాడగును,
10. శత్రురాశిలో నున్న శాస్త్రవేత్తయగును.
11. శత్రు నవాంశలోనున్న శత్రువుల వలన యుద్ధములో బాధింపబడును.
12. స్వరాశిలో సూర్యుడు తృతీయభావములోనున్న జాతకుడు గుణహీనుడగును.

**తృతీయభావస్థ చంద్ర ఫలము :-**

**మిత్ర: కదర్య: స్వపతి: నిరజ్క: పరదార్యనావ్**
**అన్తకో నర్తకో భేదు: పరవఞ్చక ఏవ చ 5**
**బహుదోషీ నిర్ఘృణశ్చ మిత్రాధమతమోఽపి చ**
**మాయావీ పరదారైకరతిశ్చన్ద్రే తృతీయగే 6**

1. తృతీయభావములో చంద్రుడు ఉచ్చరాశిలోనున్న జాతకుని మిత్రుడు చెడు ప్రవర్తన కలవాడగును. జాతకుడు ధనవంతుడగును.
2. ఉచ్చనవాంశలోనున్న స్వతంత్రమైన ఆలోచనలతో కూడియుండును.
3. శుభగ్రహ వర్గములోనున్న పరదారా రతుడగును.
4. నీచరాశిలోనున్న యమరాజువలె నాశనము చేయును.
5. నీచనవాంశలోనున్న కార్యము చేయుటలో సమర్థుడగును.
6. పాపగ్రహ షడ్వర్గములోనున్న జాతకుడు గుప్తచరుడగును.
7. మిత్రరాశిలోనున్న ఇతరులను మోసము చేయును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు అనేక దోషములను కలిగియుండును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు దయారహితుడగును.
10. శత్రురాశిలో నున్న నీచవ్యక్తులతో స్నేహము చేయును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు మాయావి యగును.
12. స్వరాశిలోనున్న జాతకుడు పరస్త్రీలయందు రక్తి కలిగియుండును.

**తృతీయభావస్థ కుజ ఫలము :-**

**వరరాజా ప్రధానశ్చ రాజమాన్యోఽథ శాస్త్రవిత్**
**భృతకో వ్యసనీచైవ సుఖీ వాఽథ కుమారక: 7**
**బహ్వన్న పానసంయుక్త: సహజాశ్రిత ఏవ చ**
**సమృద్ధో దణ్డనాథశ్చ భౌమే సహజగేతథా 8**

1. జన్మకుండలిలో తృతీయభావములో కుజుడు ఉచ్చరాశిలోనున్న శ్రేష్ఠమైన రాజగును.
2. ఉచ్చనవాంశలో కుజుడున్న జాతకుడు ప్రధానమైన వ్యక్తి యగును.
3. శుభగ్రహ వర్గములోనున్న జాతకుడు రాకమాన్యుడగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు శాస్త్రవేత్తయగును.
5. నీచనవాంశలోనున్న వేతనభోగి యగును. అనగా ఉద్యోగము చేయుచు జీవించు వాడగును.
6. పాపగ్రహ షడ్వర్గములోనున్న జాతకుడువ్యసనపరుడగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు సుఖజీవనమును గడుపును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు సుకుమార శరీరము కలవాడగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు అన్నపానాదులతో సమృద్ధిగా నుండును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు సోదరులపై ఆధారపడి జీవించును.
11. శత్రు నవాంశలోనున్న ఆర్థికముగా సంపన్నుడగును.
12. స్వరాశిలోనున్న జాతకుడు న్యాయాధికారులతో కూడియుండును.

**తృతీయభావస్థ బుధ ఫలము :-**

**ఖణ్డోऽథ కుమ్భకీచైవ కృతఘ్న: పాపతత్పర:**
**గోపాలో గతసౌహార్ద్రో బహుకామార్థనాపిత: 9**
**కుమ్భకారోऽథ నిస్వ్యశ్చ లోకాదిష్ట చరిత్రవాన్**
**చౌరోబుధే భవేన్నిత్యం జన్మలగ్నా తృతీయగే 10**

1. బుధుడు తృతీయభావములో తన ఉచ్చరాశిలోనున్న జాతకుడు వికలాంగుడు, అసమర్థుడగును.
2. ఉచ్చనవాంశలోనున్న శంఖ సమానమైన మెడ కలవాడగును.
3. శుభగ్రహ వర్గములోనున్న కృతఘ్నుడగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు పాపపరాయణుడగును.
5. నీచనవాంశలోనున్న గోవులను పాలించువాడు, పాలను విక్రయించువాడగును.
6. పాపగ్రహ షడ్వర్గములోనున్న జాతకుడు ఎవరితో స్నేహము చేయడు.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు అనేకమైన కోరికలతో అధిక ధనమును సంగ్రహించు వాడగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు కుంభాకార వృత్తి కలిగియుండును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు అందరిచే నిందింపబడువాడగును.

10. శత్రురాశిలో నున్న జాతకుడు అందరిని ద్వేషించును.
11. శత్రు నవాంశలోనున్న మంచి నడవడిక కలవాడగును.
12. స్వరాశిలో తృతీయభావములో బుధుడున్న జాతకుడు దొంగయగయను.

**తృతీయ భావస్థ గురు ఫలము :-**

**అవినీతో దుష్టచిత్తో నృశంస్యాల్ప ప్రజస్తథా**
**దరిద్రో ద్యూతనిరతో నిబన్ధరతి కార్యవాన్ 11**
**పుణ్యైక తత్పరో ద్యూతకార: క్లీబోఽథ శిల్పవాన్**
**నికృష్టా పతితో జీవే క్రమాత్ సహజ భావగే 12**

1. గురుడు తృతీయభావములో తన ఉచ్చరాశిలోనున్న జాతకుడు వినయము కలిగిన వాడగును.
2. ఉచ్చనవాంశలోనున్న జాతకుడు దుష్టస్వభావము కలిగియుండును.
3. శుభగ్రహ వర్గములోనున్న జాతకుడు తక్కువ సంతానము కలిగియుండును.
4. నీచరాశిలోనున్న జాతకుడు దరిద్రుడగును.
5. నీచనవాంశలోనున్న జ్యూదమునందాసక్తి కలిగినవాడగును.
6. పాపగ్రహ షడ్వర్గములోనున్న జాతకుడు బంధువులు లేనివాడగును.
7. మిత్రరాశిలోనున్న అత్యంత బలహీనుడగును.
8. మిత్ర నవాంశలోనున్న వ్యాపారమునందాసక్తి, జ్యూదమునందాసక్తి కలవాడగును.
9. వర్గోత్తమములోనున్న నపుంసకుడగును.
10. శత్రురాశిలో నున్న శిల్పవిద్యయందు ప్రావీణ్యుడగును.
11. శత్రు నవాంశలోనున్న నికృష్టుడగును.
12. స్వరాశిలో నున్న జాతకుడు ధృఢమైన మనస్తత్వము కలవాడగును.

**తృతీయభావస్థ శుక్ర ఫలము :-**

**పతిత: క్లేశ: జీవీ చ తత: కలహవల్లభ:**
**వఞ్చకో నీచకులజో నృశంసోభణ్డ ఏవచ 13**
**దుశ్చారణోఽథ సబల: కృతఘ్నో క్రీడనస్తథా**
**శిల్పజ్ఞ: స్వజన త్యక్త: శుక్రే సహజగే సఖా 14**

1. శుక్రుడు తృతీయభావములో తన ఉచ్చరాశిలోనున్న జాతకుడు పతితుడగును.
2. ఉచ్చనవాంశలోనున్న జాతకుడు కలహప్రియుడగును.
3. శుభగ్రహ షడ్వర్గములోనున్న జాతకుడు వంశకుడగును,
4. నీచరాశిలోనున్న జాతకుడు నీచకులములో పుట్టినవాడగును.

5. నీచనవాంశలోనున్న దయలేని వాడగును.
6. పాపగ్రహ షడ్వర్గములోనున్న జాతకుడు అపహాస్యము చేయువాడగును.
7. మిత్రరాశిలోనున్న అధిక పరిశ్రమ చేయువాడగును.
8. మిత్ర నవాంశలోనున్న బలవంతుడగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు కృతఘ్నుడగును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు క్రీడాకారుడగును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు శిల్పశాస్త్రములో పండితుడగును.
12. స్వరాశిలో నున్న జాతకుడు తనస్వజనులను విడిచి అన్యజనులతో స్నేహము కలిగి యుండును.

**తృతీయభావస్థ శని ఫలము :-**

**వరరాజ్ఞాథ ధనవాన్ శాస్త్రజ్ఞే మలినాత్మవాన్**
**వఞ్చకో నిర్ఘృణో మన్త్రీ న్యాయజ్ఞో గుణ విత్తవాన్ 15**
**మానీ పానరతో దీనో జితారీ: సహజ శనౌ**
**చన్ద్ర శుక్రేజ్య సౌమార్కి భౌమార్కైస్తైఽ ధికా: క్రమాత్ 16**

1. శని తృతీయభావములో తన ఉచ్చరాశిలోనున్న జాతకుడు ఉత్తమమైన శాసనము చేయు రాజగును..
2. ఉచ్చనవాంశలోనున్న జాతకుడు ధనవంతుడగును.
3. శుభరాశి షడ్వర్గములోనున్న జాతకుడు శాస్త్రజ్ఞుడు, వైజ్ఞానికుడగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు చెడు ఆలోచనలు కలిగినవాడగును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు వంశకుడు, ఇతరులను మోసము చేయువాడగును.
6. పాపగ్రహ షడ్వర్గములోనున్న జాతకుడు దయారహితుడగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు న్యాయవేత్తయగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు గుణవంతుడు ధనవంతుడగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు స్వాభిమాని యగును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు అధికముగా మద్యము సేవించువాడగును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు దీనస్వభావము కలవాడగును.
12. స్వరాశిలో నున్న జాతకుడు శత్రువులను జయించును.

**విశేషము –** తృతీయభావము పరాక్రమము,సాహసము సహోదరుడు, సేవకునికి సంబంధించినదగును. ఇతరుల సహాయ విషయము తృతీయభావములోనుండును. సామాన్యముగా తృతీయభావములో పాపగ్రహముల వలన శుభఫలము,శుభ గ్రహము ల వలన పాపఫలము కలుగును.

## తృతీయభావస్థిత గ్రహఫల చక్రము

| గ్రహముల ద్వాదశ స్థితి | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| ఉచ్చ | రాజు | ధని | వరరాజు | ఖండ | అవినీతి | పతిత | వరరాజు |
| ఉచ్చ నవాంశ | రాజపుత్ర | నిరంక | ప్రధాన | కంచుకి | అవినమ్ర | కలహప్రియ | ధనవాన్ |
| శుభవర్గు | సార్వ భౌమ | పరదా ర్య వాన్ | రాజ మాన్య | కృతఘ్న | నృశంస్య | పంచక | శాస్త్రజ్ఞ |
| నీచ రాశి | నీచ | అంతక | శాస్త్రవేత్త | పాపరత | దరిద్ర | నీచకులజ | మలినాత్మ |
| నీచ నవాంశ | భిక్షుక | నర్తక | భృతక | గోపాల | ద్యూత నిరత | నృశంస | వంచక |
| పాపవర్గు | అగ్రవిరోధి | గుప్తచర | వ్యసని | గత సౌహార్ద్ర | బంధు హీన | ఖండ | నిర్ఘృణ |
| మిత్రరాశి | చారణ | పరవంశక | సుఖి | బహు కామార్థ | పుణ్యకర్మి | దుశ్చరణ | మంత్ర |
| మిత్ర నవాంశ | బ్రాహ్మణి | బహుదోషీ | సుకుమార | కుంభ కార | ద్యూత కార | సబల | గుణవాన్ |
| వర్గోత్తమం | కులీన | నిర్ఘృణ | అన్నపాన యుక్త | నింద్య | క్లీబ | కృతఘ్న | స్వాభి మాని |
| శత్రురాశి | శాస్త్రవేత్త | అధమ మిత్ర | సహజా శ్రిత | లోకద్వేషి | శిల్పి | క్రీడి | పానరత |
| శత్రు నవాంశ | వైరిక్ష తాంగ | మాయావి | సమృద్ధ | చరిత్ర వాన్ | నికృష్ట | శిల్పజ్ఞ | దీన |
| స్వరాశి | నిర్గుణ | పరదా రైక రతి | దండ నాథ | చోర | పతిత | స్వజన త్యక్త | జితారి |

**కశ్యపజాతకములోని పంచమాధ్యాయము సమాప్తము**

## 6. షష్ఠాధ్యాయము

### చతుర్థభావ ఫలాధ్యాయము

**సుఖభావ ద్వాదశవిధ ఫలము :**

**స్వోచ్చే స్వోచ్చనవాంశే వా శుభవర్గోఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రభే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరిభేర్యంశే స్వర్‌క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలం ద్వాదశ భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

మహర్షి చ్యవనముని వచనానుసారము 1.స్వోచ్చ 2. స్వోచ్చనవాంశ 3. శుభ షడ్వర్గ 4. నీచరాశి 5.నీచనవాంశ 6. పాప షడ్వర్గ 7. మిత్రరాశి 8. మిత్ర నవాంశ 9. వర్గోత్తమ 10.శత్రురాశి 11.శత్రు నవాంశ 12. స్వరాశిగతము అని పన్నెండు విధములుగా చతుర్ధ భావ ఫలమును తెలుపవలెను.

**చతుర్థభావ స్థిత రవి ఫలము :-**

**కష్టజం స్వల్పవిత్తఞ్చ పరదార భవంనవమ్**
**దు:ఖాద్యం ఋణదు:ఖాఢ్యం సపాపఞ్చౌర్య సమ్భవమ్ 3**
**నిత్యం క్షయం యుద్ధభవం పరసేవా భవం తథా**
**బధ బన్ధ భవం సూర్యే సుఖం స్యాత్ సుఖభావగే 4**

1. రవి చతుర్ధభావములో ఉచ్చరాశిలోనున్న జాతకుడు ముందుగా కష్టములను అనుభవించి తర్వాత సుఖమును పొందును.
2. స్వోచ్చనవాంశలో రవియున్న జాతకుడు స్వల్ప ధనము కలిగియుండును.
3. శుభరాశి వర్గములోనున్న పరస్త్రీ వలన సుఖము కలుగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు నూతనములైన సుఖములను పొందును.
5. నీచనవాంశలోనున్న దు:ఖమును పొందును.
6. పాపరాశి వర్గములోనున్న జాతకుడు ఋణభారముతో దు:ఖితుడగును.
7. మిత్రరాశిలోనున్న పాపకర్మల వలన సుఖమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు తండ్రి వలన సుఖమును పొందును.
9. వర్గోత్తమములోనున్న నిత్యము ధనహాని కలుగును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు యుద్ధములో జయము కలుగుట వలన సుఖమును పొందును.
11. శత్రు నవాంశలోనున్న ఇతరులతో కపటముతో ప్రవర్తించి సుఖమును పొందును.
12. స్వరాశిలో చతుర్ధభావములో నున్న జాతకుడు హింస చేయుట వలన సుఖమును పొందును.

**చతుర్థభావ స్థిత చంద్ర ఫలము :-**

**గజాశ్వజం హేమభవం నిత్యమేకవిధం తథా**
**ద్యూతజం భూరి కృషిజం పాపజం బహుపుత్రజమ్ 5**
**పితృజం వినయోద్భూతం అనీతి జనితం తథా**
**కపటోత్థం ఖలోద్భూతం సుఖంచన్ద్రే సుఖిస్థితే 6**

1. చంద్రుడు చతుర్థభావములో ఉచ్చరాశిలోనున్న గజాశ్వముల వలన సుఖమును పొందును.
2. స్వోచ్చనవాంశలో నున్న స్వర్ణము వలన సుఖమును పొందును.
3. శుభరాశి వర్గములోనున్న ఎల్లప్పుడు ఒకేవిధముగా సుఖము పొందును.
4. నీచరాశిలోనున్న జ్యూదము వలన సుఖమును పొందును.
5. నీచనవాంశలోనున్న అధికమైన పరిశ్రమ చేయుట వలన సుఖమును పొందును.
6. పాపషడ్వర్గులోనున్న పాపకర్మ వలన సుఖమును పొందును.
7. మిత్రరాశిలోనున్న సంతానమధికమగుట వలన సుఖమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు తండ్రి వలన సుఖమును పొందును.
9. వర్గోత్తమములోనున్న వినయముతో ఉండుట వలన సుఖమును పొందును.
10. శత్రురాశిలో నుండుట వలన నీతిహీనమైన పనులు చేయుట వలన సుఖమును పొందును.
11. శత్రు నవాంశలోనున్న మోసము చేయుట వలన సుఖమును పొందును.
12. స్వరాశిలో చంద్రుడున్న జాతకుడు దుష్టులతో స్నేహము చేయుట వలన సుఖమును పొందును.

**చతుర్థభావస్థిత కుజ ఫలము :-**

**పర సూదన సంభూతం పరవఞ్చన సమ్భవమ్**
**వఞ్చనోత్థం నైవపరం మోషజం బుధబన్ధజమ్ 7**
**పరశోకోత్థమన్యాయాత్ పరస్వవిలయోద్ భవమ్**
**పౌశ్చల్యా పరయేత్యుత్థం సుఖం మోహాత్ కుజేసుఖే 8**

1. కుజుడు చతుర్థభావములో స్వోచ్చలోనున్న జాతకుడు ఇతరులను బాధించుట వలన సుఖమును పొందును.
2. స్వోచ్చనవాంశలో నున్న ఇతరులను మోసము చేయుట వలన సుఖమును పొందును.
3. శుభరాశి వర్గములోనున్న మోసపూరితమైన కార్యముల చేయుటయందాసక్తి కలిగి ఉండును.
4. నీచరాశిలోనున్న జాతకుడు సమానముగా సుఖదు:ఖములను అనుభవించును.

5. నీచనవాంశలోనున్న దొంగతనము చేసి సుఖమును పొందును.
6. పాపగ్రహషడ్వర్గులోనున్నజాతకుడు ఇతరులను బాధించుట వలన సుఖమును పొందును.
7. మిత్రరాశిలోనున్న ఇతరుల శోకమును చూచి సుఖమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న ఇతరులకు అన్యాయము చేసి సుఖమును పొందును.
9. వర్గోత్తమములోనున్న ఇతరుల సంపత్తిని హరించి సుఖమును పొందును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు పుంశ్చలీ స్త్రీ వలన సుఖమును పొందును.
11. శత్రు నవాంశలోనున్న పరస్త్రీ ప్రేమగానుండుట వలన సుఖమును పొందును.
12. స్వరాశిలో నున్న జాతకుడు గృహస్థాశ్రమములో తనకున్న ఆసక్తితో సుఖమును పొందును..

**చతుర్థభావస్థిత బుధ ఫలము :-**

**మహాజనోత్థం రాజోత్థమక్షయం క్లేశజంతత:**
**పరసేవా సముద్భూతమథ చాన్త్యజసఙ్గజమ్ 9**
**సుపుత్రజం కలత్రోఽ త్థం కన్యోత్థం క్రయవిక్రయాత్**
**పశుపాల్యాత్ స్వబన్ధుభ్య: సుఖం సౌమ్యే సుఖేస్థితే 10**

1. బుధుడు చతుర్థభావములోఉచ్చరాశిలోనున్నవిద్వాంసులసాంగత్యము వలన సుఖమును పొందును. అతడు కళాకారులు సమజనుల సాన్నిధ్యమును పొంది సుఖించును.
2. ఉచ్చనవాంశలో ఉన్న రాజసమానమైన వ్యక్తి వలన సుఖమును పొందును.
3. శుభరాశి వర్గములోనున్న అక్షయ సుఖము పొందును.
4. నీచరాశిలోనున్న కష్టము చేయుట వలన సుఖమును పొందును.
5. నీచనవాంశలోనున్న పరసేవ వలన సుఖమును పొందును.
6. పాపషడ్వర్గులోనున్న అంత్యజుల సహవాసముతో సుఖమును పొందును.
7. మిత్రరాశిలోనున్న గుణవంతులైన పుత్రుల వలన సుఖమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న మంచి భార్య దొరుకుట వలన సుఖమును పొందును.
9. వర్గోత్తమములోనున్న కన్యా సంతతి వలన సుఖమును పొందును.
10. శత్రురాశిలో నున్న క్రయ విక్రయముల వలన సుఖమును పొందును.
11. శత్రు నవాంశలోనున్న పశుపాలన వలన సుఖమును పొందును.
12. స్వరాశిలో చంద్రుడున్న జాతకుడు తన బంధు జనుల వలన సుఖమును పొందును.

**చతుర్థభావస్థ గురు ఫలము :-**

**నిత్యపూర్ణో సుఖార్థేచ ధర్మజం నీచసంగజమ్**
**మిశ్రభావ సముద్భూతం మోషణోత్థం తథాఙ్గజమ్ 11**
**భృత్యజం భగినీజాతం నీచసేవా సముద్భవమ్**

నీచసేవా భవం భూప సజ్జజం సుఖగే గురౌ 12

1. గురుడు చతుర్థభావములో ఉచ్చరాశిలోనున్న జాతకుడు నిత్యము ఆనందము సమృద్ధితో సుఖముగా నుండును.
2. ఉచ్చనవాంశలోనున్న సుఖము కలుగును.
3. శుభవర్గములోనున్న జాతకుడు ధర్మకార్యములు చేయుట వలన సుఖము పొందును.
4. నీచరాశిలోనున్న నీచజనుల సాంగత్యము వలన సుఖమును పొందును.
5. నీచనవాంశలోనున్న సజ్జన దుర్జనుల సహవాసముతో సుఖమును పొందును.
6. పాపరాశి షడ్వర్గలోనున్న జాతకుడు దొంగతనము వలన సుఖమును పొందును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని శరీరమునకు సుఖము కలుగును.
8. మిత్ర నవాంశలోనున్న సేవకుల వలన సుఖమును పొందును.
9. వర్గోత్తమములోనున్న జాతకునికి సోదరి వలన సుఖమును కలుగును.
10. శత్రురాశిలో నున్న దుష్టులకు సేవ చేయుట వలన సుఖమును పొందును.
11. శత్రు నవాంశలోనున్న నీచులకు సేవచేయుట వలన సుఖమును పొందును.
12. స్వరాశిలో గురువున్న జాతకుడు రాజు లేక రాజపురుషుని సహాయము దొరుకుట వలన సుఖము ప్రాప్తించును.

**చతుర్థభావస్థిత శుక్ర ఫలము :-**

**మిత్రజాతం ఖరోష్ట్రోఽత్థం గజవాజి సముద్భవమ్**
**పరదార్యాత్ వినాశోఽత్థం గురుపత్నీ సముద్భవమ్** 13
**గోధనోత్థమ జావ్యుత్థం మహిషీజం కుసేవయా**
**పరదేశభవం దేవ ద్విజ సజ్ఞాత్ సుఖే భృగు:** 14

1. శుక్రుడు చతుర్థభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు తన మిత్రుల వలన సుఖమును పొందును.
2. ఉచ్చనవాంశలోనున్న వాహనముల వలన సుఖమును పొందును.
3. శుభ వర్గములోనున్న ఉత్తమమైన వాహనముల వలన సుఖము లభించును.
4. నీచరాశిలోనున్న పరస్త్రీ వలన సుఖము కలుగును.
5. నీచనవాంశలోనున్న భోగవిలాసముల వలన అన్ని పోగొట్టుకొన్న తర్వాత సుఖము కలుగును.
6. పాపషడ్వర్గలోనున్న భార్య వలన లేదా యజమాని భార్య వలన సుఖమును పొందును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు గోవులను పెంచుట వలన సుఖము కలుగును.
8. మిత్ర నవాంశలోనున్న మేకల వలన సుఖమును పొందును.
9. వర్గోత్తమములోనున్న గేదెలను ఎద్దులను పెంచుట వలన సుఖము లభించును.

10. శత్రురాశిలో నున్న ఇతర వ్యక్తులకు సేవ చేయుట వలన సుఖము కలుగును.
11. శత్రు నవాంశలోనున్న ఇతర దేశములకు వెళ్ళుటవలన సుఖము కలుగును.
12. స్వరాశిలో నున్న జాతకుడు దేవ బ్రాహ్మణ సాధువులకు సేవచేయుట వలన సుఖమును పొందును.

**చతుర్థభావస్థ శని ఫలము :-**

**పక్షిణోబన్ధనాద్యుత్థం మాంసాహారేణ కర్షణాత్**
**అమానుష్యాత్ లోకబన్ధాత్ పరరన్ధ్రాదతి సంగజమ్ 15**
**స్వస్త్రీ త్యాగభవం స్వీయమోష్య హానే: పరార్దనాత్**
**పరవఞ్చనజం మర్త్య విక్రయాద్ రస విక్రయాద్ 16**

1. శని చతుర్థభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు పక్షులను బంధించుట వలన సుఖానుభవమును పొందును.
2. ఉచ్చనవాంశలోనున్న మాంసాహారము సేవించుట వలన సుఖమును పొందును.
3. శుభ రాశి వర్గములోనున్న వ్యవసాయము వలన సుఖము పొందును.
4. నీచరాశిలోనున్న భూత ప్రేతాదుల వలన సుఖమును పొందును.
5. నీచనవాంశలోనున్న సమాజముతో విరోధము వలన సుఖమును పొందును.
6. పాప షడ్వర్గులోనున్న ఇతరుల దోషములను తనవిగా భావించి సుఖమును పొందును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు తన పత్నిని వదిలి పెట్టి సుఖమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న తన పత్నికి నష్టము కలుగుట వలన సుఖమును పొందును.
9. వర్గోత్తమములోనున్న ఇతరులకు హానికలిగించి వారిని చూచి సుఖమును పొందును.
10. నీచరాశిలో నున్న ఇతరులను మోసము చేయుట వలన సుఖమును పొందును.
11. నీచ నవాంశలోనున్న స్త్రీ పురుషులను ఇతరులకు అమ్ముటవలన సుఖమును పొందును.
12. స్వరాశిలో నున్న జాతకుడు రస పదార్థములు (పాలు పెరుగు నెయ్యి మజ్జిగ మున్నగునవి) విక్రయించడము వలన సుఖమును పొందును.

**గ్రహములకు సుఖమునిచ్చు శక్తి :-**

**సుఖం శనౌ సుఖస్యేస్యాదథ శ్రేష్ఠం క్రమాచ్చతత్**
**శని భౌమార్క శుక్రజ్ఞ చన్ద్రజీవై: సుఖస్థితౌ 17**

చతుర్థభావములో శని శుభస్థితిలోనున్న సుఖమునిచ్చును. శనికన్న రవి వలన అధిక సుఖము కలుగును. రవికన్న అధిక సుఖము శుక్రుడు, శుక్రునికన్న అధిక సుఖము బుధుడు, బుధునికన్న అధిక సుఖము చంద్రుడు ప్రదానము చేయును. చంద్రునికన్న గురువు అధిక బలమునిచ్చును.

# చతుర్థ భావస్థిత గ్రహఫల చక్రము

| గ్రహముల ద్వాదశ స్థితి | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| **స్వోచ్ఛ** | కష్టజ సుఖము | వాహన జన్యము | పరహత్య | మహా జనులు | నిత్య సుఖము | మిత్ర జన్యము | పక్షిబం ధనము |
| **సోచ్ఛ నవాంశ** | స్వల్ప విత్తనము | స్వర్ణ జన్యము | పర వంచన | శాసకుడు | సుఖ సమృద్ధి | వాహన జన్యము | మాంసా హారము |
| **శుభవర్గ** | పరదార జన్యము | నిత్య సుఖము | వంచన | అక్షయ సుఖము | ధర్మజము | వాహన జన్యము | కర్షణము |
| **నీచ రాశి** | నూతన సుఖము | ద్యూత జన్యము | మధ్య మము | క్లేశ జన్యము | నీచ సంగము | పరదార జన్యము | అమను ష్యాలు |
| **నీచ నవాంశ** | దు:ఖము | అధిక కృషి | మోసము | పరసేవ | మిశ్రిత సుఖము | వినాశ జన్యము | లోక బంధనము |
| **పాపవర్గ** | ఋణ భారము | పాప జన్యము | బంధ జము | అంత్య సంగమం | చౌర్య జన్యము | గురుపత్నీ జన్యము | పర రంధ్రము |
| **మిత్రరాశి** | సపాసము | బహుపుత్ర జము | పరశో కోత్థము | సుపుత్ర జము | అంగ జము | రోధన జన్యము | స్వస్త్రీ త్యాగము |
| **మిత్ర నవాంశ** | చౌర్య జన్యము | పితృ జము | అన్యాయ జన్యము | కలత్రో త్థము | భృత్యు జము | అజావ్య త్థం | స్వస్త్రీ త్యాగము |
| వర్గోత్తమం | నిత్య సుఖ హాని | వినయ జన్యము | వంచ నము | కన్యో త్థము | భగినీ జన్యము | మహిషీ జన్యము | పరద మనము |
| **శత్రురాశి** | విరోధము | అనీతి జన్యము | పుంశ్చలి | క్రయ విక్రయము | నీచ సేవ | కుసేవ | పర వంచన |
| **శత్రు నవాంశ** | పరసేవ | కపట జన్యము | పర దార | పశు పాలనము | నీచ సేవ | పరదేశ జన్యము | మనుష్య విక్రయము |
| **స్వరాశి** | వధ బంధము | దుష్ట జన్యము | మోహము | స్వబంధు వులు | శాసన జన్యము | ద్విజ సేవ | రస విక్రయము |

**కశ్యపజాతకములోని షష్ఠాధ్యాయము సమాప్తము**

# 7. సప్తమాధ్యాయము

## పంచమభావ ఫలాధ్యాయము

**గ్రహముల ద్వాదశస్థ ఫల కథనము :**

**స్వోచ్ఛే స్వోచ్ఛనవాంశే చ శుభవర్గోఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రభే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరిభేర్యంశే స్వర్క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలం ద్వాదశ భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

మహర్షి చ్యవనముని వచనానుసారము 1.స్వోచ్ఛరాశి 2.స్వోచ్ఛనవాంశ 3.శుభ షడ్వర్గు 4.నీచరాశి 5. నీచనవాంశ 6. పాపషడ్వర్గు 7. మిత్రరాశి 8. మిత్ర నవాంశ 9. వర్గోత్తమము 10.శత్రురాశి 11.శత్రు నవాంశ 12.స్వరాశులలో నున్న గ్రహముల ఫలితములు తెలుపబడెను.

**పంచమభావస్థ ద్వాదశవిధ రవి ఫలము :-**

**హింస్రాశ్చాల్పాయుషో దైన్య రోగాద్యా జాతినష్టకా:**
**వికలాఙ్గా గర్భనష్టస్త్రైణ్ణ సౌభాగ్య సంయుతా: 3**
**సుశీలవృత్తా వ్యసన సంయుతా పరదారజా:**
**పరస్త్రీజ విగుణాశ్చౌరార్కే పఞ్చమే సుతా: 4**

1. రవి పంచమభావములో స్వోచ్ఛరాశిలోనున్న జాతకుడుపుత్రాదులను హింసించువాడగును.
2. ఉచ్ఛనవాంశలోనున్న జాతకుని సంతతి అల్పాయువును కలిగియుండును. సంతానము 32 - 40 సంవత్సరముల మధ్య మృత్యువును పొందును.
3. శుభ రాశి వర్గములోనున్న సంతతి దీనత్వముతో నుండును.
4. నీచరాశిలోనున్న తన సంతానము తమ కుటుంబమునకు హాని కలిగించును.
5. నీచనవాంశలోనున్న సంతానము వికలాంగములతో నుండును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని సంతానము గర్భములోనే నష్టమును పొందును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని సంతతి భాగ్యవంతులగును.
8. మిత్ర నవాంశలోనున్న సంతతి సదాచారము కలిగియుండును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని సంతానము వ్యసనపరులగును.
10. నీచరాశిలో నున్న స్త్రీ సంతతి కలుగును.
11. నీచ నవాంశలోనున్న ఇతర స్త్రీల వలన సంతతి కలుగును.
12. స్వరాశిలో నున్న జాతకుడుగుణహీనుడు చోరుడగును.

**పంచమభావస్థ చంద్ర ఫలము :-**

**సులోచనా రమ్యరూపా సౌభాగ్య సంయుతా:**
**పాపా: పాపైకనిరతా: పరరక్తా: సుశీలకా: 5**
**శౌచదైన్యయుతా: భర్తృపరహీన స్వభావకా:**
**వ్యఙ్గాప్రగల్భసుభగా: కన్యాశ్చన్ద్రే సుతస్థితే 6**

1. చంద్రుడు పంచమభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు సుందరమైన నేత్రములు కలవాడగును.
2. ఉచ్చనవాంశలోనున్న జాతకుని పుత్రిక రూపవతి యగును.
3. శుభ రాశి వర్గములోనున్న పుత్రిక రూపవతి సంతానవతి యగును.
4. నీచరాశిలోనున్న పుత్రిక అశుభకర్మ చేయునదగును.
5. నీచనవాంశలోనున్న పుత్రిక పాపాచారము కలదగును.
6. పాప షడ్వర్గలోనున్న జాతకుని సంతతి పరపురుషునిపై ఆసక్తి కలిగియుండును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని పుత్రిక సుశీలయగును.
8. మిత్ర నవాంశలోనున్న పుత్రిక పవిత్రురాలు, దీనురాలగును.
9. వర్గోత్తమములోనున్న పుత్రిక పతిభక్తి కలిగినదగును.
10. శత్రురాశిలో నున్న పుత్రిక నికృష్టురాలగును.
11. శత్రు నవాంశలోనున్న పుత్రిక శరీరము వికృతముగా నుండును.
12. స్వరాశిలో నున్న జాతకుని పుత్రిక చతురురాలు, సౌభాగ్యవతి యగును.

**పంచమభావస్థ కుజ ఫలము :-**

**శౌర్యాల్ప జీవినో రోగయుక్తా: పాపర్ద్ధదేహిన:**
**పరదారయుతాఽల్పాయుషా: పాపా మితంయవా: 7**
**విరుద్ధవిధిసంయుక్తా బన్ధుహీనశ్చ సవ్రణా**
**కుచైలా: పరతర్కికా: స్యు: కుజే తనయుగేసుతా: 8**

1. పంచమభావములో ఉచ్చలో కుజుడున్న జాతకుడు పరాక్రమవంతుడగును కాని అల్పాయువు కలిగి యుండును.
2. ఉచ్చనవాంశలోనున్న జాతకుని పుత్రుడు రోగయుక్తుడగును.
3. శుభ రాశి వర్గములోనున్న పుత్రుడు పాపకర్మ చేయువాడగును.
4. నీచరాశిలోనున్న జాతకుని పుత్రుడు పరస్త్రీలపై వ్యామోహము కలిగియుండును.
5. నీచనవాంశలోనున్న పుత్రుడు అల్పాయువు కలవాడగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని సంతతి పాపాత్ములగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని పుత్రుడు మందగతితో చలించును.
8. మిత్ర నవాంశలోనున్న పుత్రుడు ధర్మ విరుద్ధముగా ప్రవర్తించును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని పుత్రుడు బంధువుల ముందు హీనముగా ప్రవర్తించును.

10. శత్రురాశిలో నున్న జాతకుని పుత్రుని శరీరముపై వ్రణములుండును.
11. శత్రు నవాంశలోనున్న పుత్రుడు మలిన వస్త్రములు ధరించును.
12. స్వరాశిలో నున్న జాతకుని పుత్రుడు ఇతరులను గురించి ఆలోచిస్తు సమయమును వ్యర్థము చేయును.

**పంచమభావస్థ బుధ ఫలము :-**

**సుభగాస్యుర్వినయినో వీర్యవన్తో౽తి దు:ఖితా:**
**పుత్రా: సువికృతా: కన్యా నృశంసా చాథవాత్మజా 9**
**నిరుజా: శౌచ నిపుణా నీతిజ్ఞాహతబాన్ధవా:**
**పిశునాగురుదేవాదిభక్తా: స్యు: పఞ్చమే బుధే 10**

1. బుధుడు పంచమభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుని పుత్రుడు సుందరుడు, భాగ్యవంతుడగును.
2. ఉచ్చనవాంశలోనున్న జాతకుడు వినయము కలిగియుండును.
3. శుభ షడ్వర్గులోనున్న పుత్రుడు శక్తిశాలి యగును.
4. నీచరాశిలోనున్న జాతకుని పుత్రుడు దు:ఖితుడగును.
5. నీచనవాంశలోనున్న పుత్రుడు వికారయుక్తుడగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని పుత్రిక నిందనీయురాలగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని పుత్రుడు రోగహీనుడగును.
8. మిత్ర నవాంశలోనున్న పుత్రుడు శౌచాచారపరాయణుడగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని పుత్రుడు నైతిక ఆచారము కలిగినవాడగును.
10. శత్రురాశిలో నున్న జాతకుని పుత్రుడు బంధువులు లేనివాడగును.
11. శత్రు నవాంశలోనున్న పుత్రుడు చాడీలు చెప్పువాడగును.
12. స్వరాశిలో నున్న జాతకుని పుత్రుడు గురు దేవ బ్రాహ్మణాదులను పూజించువాడగును.

**పంచమభావస్థ గురు ఫలము :-**

**బహువీర్యాశ్చ సుభగా: ప్రియలోకాశ్చ దు:ఖితా**
**పాపినీగత సౌహార్ద్రా నానావిధ ధనాన్వితా: 11**
**సుశీలా సుప్రభాశ్చైవ వైరాగ్య పతితాస్తథా**
**ద్యూతప్రియా౽ద్భుతాద్యా పుత్రాస్యు: పుత్రగే గురౌ 12**

1. గురుడు స్వోచ్చరాశిలో పంచమభావములోనున్న జాతకుని పుత్రునికి అత్యంత పరాక్రమము తోడగును.
2. స్వోచ్చనవాంశలోనున్న జాతకుని పుత్రుడు సౌభాగ్యవంతుడగును.
3. శుభ షడ్వర్గులోనున్న పుత్రుడు అందరికి ప్రియమైనవాడగును.

4. నీచరాశిలోనున్న జాతకుని పుత్రుడు దు:ఖితుడగును.
5. నీచనవాంశలోనున్న పుత్రుడు పాపాత్ముడగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని పుత్రుడు, మిత్రులు లేనివాడగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని పుత్రుడు అనేక విధములుగా ధనవంతుడగును.
8. మిత్ర నవాంశలోనున్న పుత్రుడు సుశీలుడగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని పుత్రుడు తేజస్వియగును.
10. నీచరాశిలో నున్న జాతకుని పుత్రుని వైరాగ్య భ్రష్టుడగును.
11. నీచ నవాంశలోనున్న పుత్రుడు జ్యూదము నందు ఆసక్తి కలవాడగును.
12. స్వరాశిలో నున్న గురుడు జాతకునికి ఒక అద్భుతమైన పుత్రుడు కలుగును.

**పంచమభావస్థ శుక్ర ఫలము :-**

**రూపశౌభాగ్యశాలినో బహుపుత్రా: సురూపకా:**
**విధిఘ్నాస్తు కురూపాఢ్యా: పరరక్తా: మితంయవా: 13**
**పతివ్రతా: సత్యపరా: సుప్రభా: పానతత్పరా:**
**కృతఘ్నా సు:ఖసంయుక్తా: కన్యాశుక్రే హతారయ: 14**

1. శుక్రుడు పంచమభావములో స్వోచ్ఛరాశిలోనున్న జాతకుడు సౌభాగ్యశాలురైన కన్యలను పొందును.
2. ఉచ్ఛనవాంశలో నున్న జాతకునికి అనేకమంది పుత్రికలు కలుగును.
3. శుభషడ్వర్గులోనున్న జాతకునికి సుందరమైన కన్యలు కలుగును.
4. నీచరాశిలోనున్న జాతకునికన్యలు శాస్త్ర విరుద్ధమైన ఆచారము కలిగియుందురు.
5. నీచనవాంశలోనున్న జాతకుని కన్యలు పరపురుషాసక్తులగుదురు.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని కన్యలు మందగతితో చలించెదరు.
7. మిత్రరాశిలోనున్న జాతకుని కన్యలు పతివ్రతలగుదురు.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుని కన్యలు సత్య పరాయణులగుదురు.
9. వర్గోత్తమములోనున్న జాతకుని కన్యలు తేజస్సును కలిగియుందురు.
10. శత్రురాశిలో నున్న జాతకుని కన్యలు మద్యపానమునందాసక్తి కలిగియుందురు.
11. నీచ నవాంశలోనున్న జాతకుని కన్యలు కృతఘ్నులగుదురు.
12. స్వరాశిలో నున్న జాతకునికి కన్యలు శత్రువులు లేనివారగుదురు.

**పంచమభావస్థ శని ఫలము :-**

**బహుద్విషో: రోగయుక్తా: కృతఘ్నా: వాల్పనష్టకా:**
**అజాతయౌవనా రోగయుక్తా:కృషిపరాయణా: 15**
**పశుపా: బహుక్లేశా: పుత్రస్యు: పుంస్త్వ హీనకా:**

**అపుత్రత్వం పానరతం పుత్రత్వం సుతగే శనౌ 16**

1. శని పంచమభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుని పుత్రులు ఇతరులతో వైరమును పొందును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుని పుత్రులు రోగులగుదురు.
3. శుభషడ్వర్గులోనున్న జాతకునిపుత్రులు కృతఘ్నులగుదురు.
4. నీచరాశిలోనున్న జాతకుని పుత్రులు అల్పాయువు కలిగియుందురు.
5. నీచనవాంశలోనున్న జాతకుని పుత్రులు యౌవనవంతులుకారు, ఎల్లప్పుడు దీనముగా ముసలితనము కలవారివలె కనపడును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని పుత్రులు రోగముతో పీడితులగుదురు.
7. మిత్రరాశిలోనున్న జాతకుని పుత్రులు శ్రామికులగుదురు.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుని పుత్రులు పశుపాలన చేయుదురు.
9. వర్గోత్తమములోనున్న జాతకుని పుత్రులు నపుంసకులగుదురు.
10. శత్రురాశిలో నున్న జాతకుని పుత్రులు హీనమైన జీవితముననుభవించెదరు..
11. శత్రు నవాంశలోనున్న జాతకుని పుత్రులు మద్యపానమునందాసక్తి కలిగి యుందురు.
12. స్వరాశిలో శని పంచమభావములోనున్న జాతకునికి పుత్రులు తప్పక కలుగుదురు.

**పంచమభావగత స్త్రీ పురుషరాశి గ్రహఫలము :-**

**సుతభావ: సమస్త్రీణాం నృణామోజ: ప్రసూదితా:**
**స్త్రీపుంక్లీబ దృష్టం ప్రాయుస్తత్తద్ ప్రసూదిత: 17**

1. జన్మకుండలిలో పంచమభావము సమరాశియైన కన్యలు అధికముగా కలుగుదురు.
2. పంచమభావము విషమరాశియైన పుత్రులు కలుగుదురు.
   విశేషము :- పంచమభావము గ్రహరహితము, దృష్టి రహితమైనపుడు ఈ ఫలము కలుగును.
3. పంచమభావముపై పురుష గ్రహము (రవి, కుజు, గురు)ల దృష్టి కలిగిన అధికపుత్ర సంతానము కలుగును.
4. పంచమభావముపై స్త్రీ గ్రహముల (చంద్ర, శుక్రుల) దృష్టి యున్న కన్యా సంతాన మధికమగును.
5. పంచమభావముపై నపుంసక గ్రహముల (బుధ,శని) దృష్టి యున్న నపుంసకులు జన్మించెదరు.
6. సమరాశిలో స్త్రీ గ్రహముల దృష్టి, యుతి యున్న కన్యాసంతానము కలుగును.
7. పంచమభావములో విషమరాశిపై పురుషగ్రహముల దృష్టి లేక యుతి యున్న నిశ్చయముగా పుత్రసంతానమధిముగా కలుగును.

## పంచమభావస్థిత ఫలచక్రము – సంతానము

| గ్రహముల ద్వాదశ స్థితులు | రవి (పుత్ర) | చంద్రుడు (పుత్ర) | కుజుడు (పుత్ర) | బుధుడు | గురువు (పుత్ర) | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| **ఉచ్ఛరాశి** | హింసక పుత్రుడు | సులోచన వీర | శూర వీర | సౌభాగ్య పుత్ర | శక్తిమాన యుతకన్య | రూప సౌభాగ్య | బహుద్వేషీ పుత్ర |
| **సోచ్ఛ నవాంశ** | అల్పాయి పుత్ర | సురూప కన్య | రోగి | వినమ్ర మిత్ర | సౌభాగ్య | బహు పుత్ర | రోగీ పుత్ర |
| **శుభవర్గ** | రోగి దీన సంతతి | రూపసౌభా గ్య కన్య | పాప కర్మ | శక్తిశాలి పుత్ర | ప్రకాశ ప్రియపుత్ర | సురూప పుత్రి | కృతఘ్న పుత్ర |
| **నీచ రాశి** | జాతినష్ట పుత్ర | పాపా చారిణి | పరదార యుత | దు:ఖి పుత్ర | పాపి | విధిఘ్న పుత్రపుత్రి | అల్పాయు పుత్ర |
| **నీచ నవాంశ** | వికలాంగ సంతతి | పరాసక్త కన్య | అల్పాయు | వికృత పుత్ర | పాపి | కురూప కన్య | అజాత యౌవనపుత్ర |
| **పాపవర్గ** | గర్భ నాశము | దుశ్శీల | పాపి పుత్ర | నృశంస కన్య | మిత్ర రహిత | మిత గతి | రోగయుక్త సంతతి |
| **మిత్రరాశి** | తేజస్వి సౌభాగ్య | సుశీల | సీమిత గతి | నిరోగ సంతతి | ధని | పతివ్రత | కృషిపరా యణపుత్ర |
| **మిత్ర నవాంశ** | సుశీల | మలిన దీన | అధార్మిక | శౌచని పుణ | సుశీల | సత్య పర | పశుపాల పుత్ర |
| **వర్గోత్తమం** | వ్యసనీ | పతి వ్రత | బంధు హీన | నీతిజ్ఞ | కాంతి మాన్ | సుప్రభ | క్లేశ యుక్త |
| **శత్రురాశి** | పరదార జ పుత్ర | తుచ్ఛ స్వభావ | వ్రణ యుక్త | హత బంధన | వైరాగ్య పతిత | పానత త్పర | పుత్ర భావ |
| **శత్రు నవాంశ** | పరస్త్రీ పుత్ర | వ్యంగ యుత | కుచైల | పిశున | ద్యూత ప్రియ | కృతఘ్న | మద్యపాన పాన |
| **స్వరాశి** | గుణహీన చోరపుత్ర | ప్రగల్భ | పరచిం తక | గురు భక్త | అద్భుత | నష్టశత్రు సంతతి | అవశ్య పుత్ర |

**కశ్యపజాతకములోని సప్తమాధ్యాయము సమాప్తము**

# 8. అష్టమాధ్యాయము

## షష్ఠమభావగత గ్రహముల ఫలము

**గ్రహముల ద్వాదశస్థ ఫల కథనము :**

**స్వోచ్చే స్వోచ్చనవాంశే చ శుభవర్గోఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రభే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరిభేర్యంశే స్వర్క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలఞ్చ శత్రు భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

మహర్షి చ్యవనముని వచనానుసారము 1.స్వోచ్చరాశి 2.స్వోచ్చనవాంశ 3.శుభ షడ్వర్గు 4. నీచరాశి 5.నీచనవాంశ 6.పాపషడ్వర్గు 7.మిత్రరాశి 8. మిత్ర నవాంశ 9.వర్గోత్తమము 10.శత్రురాశి 11.శత్రు నవాంశ 12.స్వరాశిగత గ్రహముల భావము లలో ఫలమును చ్యవనమతాను సారము తెలుపబడుతున్నది.

**షష్ఠమ భావస్థ ద్వాదశవిధ రవి ఫలము :-**

**ఉచ్చే విప్రో నరపతి: కుమతి: స్త్ర్యనురాగవాన్**
**పరతర్కక సంజ్ఞక వాజిజాత్యానురాగవాన్ 3**
**గోపాల స్త్వల్పశిల్పీ చ కామినీ కులటాసుత:**
**విలాసినీ భవేదర్కే శత్రుభావగతే క్రమాత్ 4**

1. రవి షష్ఠమ భావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు శ్రేష్ఠమైన వ్యక్తి యగును.
2. ఉచ్చనవాంశలో నున్న ఉత్తమ బ్రాహ్మణ సమానుడగును.
3. శుభషడ్వర్గులోనున్న జాతకుడు రాజసమానుడగును.
4. నీచరాశిలోనున్న దుర్బిద్ధి కలిగినవాడగును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు స్త్రీలయందనురక్తుడగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు ఇతరుల సుఖ దు:ఖములను గూర్చి ఆలోచన చేయువాడగును..
7. మిత్రరాశిలోనున్న జాతకుడు వాహనములయందు ఆసక్తి కలిగినవాడగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు గోపాలకుడగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు సామాన్య శిల్పి యగును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు కాముకస్త్రీకి పుత్రుడగును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు కులటా పుత్రుడగును.

12. స్వరాశిలో నున్న జాతకుడు విలాసవంతమైన స్త్రీకి పుత్రుడగును.

**షష్ఠమభావస్థిత చంద్ర ఫలము :-**

**శాస్త్రజ్ఞ: పరదారైకరతో భూమిపతిస్తథా**
**బహుప్రకారో వైరజ్ఞ: స్వవర్గో భూమి పాలక: 5**
**రాజపుత్రో నృశంసశ్చ విక్రాన్తో వాహినీపతి:**
**గురువత్సల ఇన్దౌ స్యాచ్ఛత్రువై శత్రుభావగే 6**

1. చంద్రుడు షష్ఠమ భావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు శాస్త్రజ్ఞుడగును.
2. ఉచ్చనవాంశలో నున్న పరస్త్రీ రతుడగును.
3. శుభషడ్వర్గులోనున్న జాతకుడు అధిక భూమిని కలిగి ఉండును.
4. నీచరాశిలోనున్న జాతకుడు అనేక విధములైన మంచి చెడు గుణములు కలిగి ఉండును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు విరోధిపై ప్రతీకారము చేయుటకు ప్రయత్నించును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు స్వర్గమును పాలించువాడగును..
7. మిత్రరాశిలోనున్న జాతకుడు సక్రమముగా భూమిని రక్షించువాడగును.
8. మిత్ర నవాంశలోనున్న రాజపుత్రునితో సమానముగా నుండును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు నృశంసకుడగును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు పరాక్రమ వంతుడగును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు సమూహమునకు నాయకుడగును.
12. స్వరాశిలో నున్న జాతకుడు గురు జనులకు ప్రియమైనవాడగును.

**షష్ఠమభావగత కుజ ఫలము :-**

**నీచ: నీచకులోత్పన్న: పరదేశస్థితస్తత:**
**అన్త్యజ: కృషికర్యా చ ధనధాన్య వివర్జిత: 7**
**పుత్రోబన్ధు: మాతులశ్చ హితవో గుణజాతభృత్**
**ప్రియసాహస ఆరేస్యాచ్ఛత్రు: శాత్రవవర్గగ: 8**

1. కుజుడు ఉచ్చరాశిలో షష్ఠమ భావములోనున్న జాతకుడు నీచ ప్రకృతి కలవాడగును.
2. ఉచ్చనవాంశలో నున్న నీచకులములో పుట్టినవాడగును.
3. శుభరాశి వర్గములోనున్న జాతకుడు ప్రవాస జీవితము గడుపును.
4. నీచరాశిలోనున్న జాతకుడు అంత్య కులములో పుట్టినవాడగును.
5. నీచనవాంశలోనున్న వ్యవసాయ దారుడగును.

6. పాప షడ్వర్గులోనున్న ధనధాన్యహీనుడగును..
7. మిత్రరాశిలోనున్న జాతకుడు పుత్రులను కలిగియుండును.
8. మిత్ర నవాంశలోనున్న బంధువులు కలవాడగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు తన మామతో కూడియుండును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు జ్యూదాది వ్యసనములతో కూడియుండును.
11. శత్రు నవాంశలోనున్న శస్త్రధారి యగును.
12. స్వరాశిలో నున్న జాతకుడు అధిక సాహసము కలవాడగును.

**షష్ఠమభావగత బుధ ఫలము :-**

**దు:ఖభావో విరూపాఢ్యోஉనుకూలో వికలేక్షణ:**
**విపాదకర కర్ణశ్చ ద్వన్ద్వహీనశ్చ మన్త్యాపి 9**
**మన్త్రిపుత్ర: పరవధూరత: పరధనాపహ:**
**నృశంస చౌరో వ్యసనీ శత్రుజ్ఞేశత్రుభావగే 10**

1. బుధుడు షష్ఠమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు దుష్ట స్వభావము కలిగి యుండును.
2. ఉచ్చనవాంశలో నున్న కురూపియగును.
3. శుభరాశి వర్గములోనున్న లోక వ్యవహారములో అందరికి ప్రియుడగును.
4. నీచరాశిలోనున్న జాతకునికి వ్యాకులతతో కూడిన నేత్రములుండును. ఎల్లప్పుడు భయముతో చూచుచుండును.
5. నీచనవాంశలోనున్న అంగహీనుడగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు సంఘర్షణతో జీవితము గడుపును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు మంత్రాంగములో నిపుణుడగును.
8. మిత్ర నవాంశలోనున్న మంత్రి పుత్రునితో సమానమగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు పరస్త్రీగామి యగును.
10. శత్రురాశిలో నున్న ఇతరుల ధనమును హరించును.
11. శత్రు నవాంశలోనున్న నృశంస కర్మ, దొంగతనము చేయును.
12. స్వరాశిలో నున్న జాతకుడు వ్యసన పరుడగును.

**షష్ఠభావగత గురు ఫలము :-**

**బహుశో మన్త్రిహీనశ్చ స్త్ర్యనుకూలోஉన్య సైనిక:**
**పాననిష్ఠో విగుణశ్చ ప్రసిద్ధ: ప్రథితస్తుత: 11**

**స్వరాఢ్యో మజ్ఞలో హీనో బాన్ధవో వినయోజ్ఝిత:**

**బహుపుత్రసుఖో జీవో శత్రు: స్వోచ్ఛత్ర భావగ:** 12

1. గురుడు షష్టమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు అధిక శత్రువులు కలవాడగును.
2. ఉచ్చనవాంశలో నున్న అనుకూలమైన సలహాలనిచ్చువారు దొరకరు.
3. శుభరాశి వర్గములోనున్న జాతకుడు భార్యకు అనుకూలవ్యక్తి యగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు ఇతరులకు సైనికునివలె పనిచేయును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు మద్యపాన ప్రియుడగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు గుణహీనుడగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు ప్రసిద్ధుడగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు అధిక గౌరవమును పొందును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు మంచి స్వరము కలిగియుండును.
10. శత్రురాశిలో నున్న శుభకార్యములు చేయును.
11. శత్రు నవాంశలోనున్న బంధువులతో పాటు అందరితో వినయముగా ప్రవర్తించడు.
12. స్వరాశిలో నున్న జాతకుడు పుత్రుల వలన సుఖమును పొందును.

**షష్ఠమభావగత శుక్ర ఫలము :-**

**జితారి: విజితారాతి: బన్ధుక: ప్రణతాహిత:**

**బహుకన్యో గజపతి: పాపవాన్ నృపబాన్ధవమ్** 13

**కలత్రవర్గోఽథశుభో నృశంసో రోమవర్జిత:**

**ధనహీనో భృగసుతే శత్రు స్వోచ్చత్రు భావగే** 14

1. శుక్రుడు షష్ఠమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు శత్రువుల జయించు వాడగును.
2. ఉచ్చనవాంశలో నున్న శత్రువులపై విజయమును పొందును.
3. శుభరాశి వర్గములోనున్న జాతకుడు శస్త్రదారియై ఎరుపురంగు కలిగియుండును.
4. నీచరాశిలోనున్న బలహీనులను హింసించువాడగును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు స్త్రీ సంతానముతో నుండును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు గజాది వాహనములు కలిగియుండును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు పాపాత్ముడగును.
8. మిత్ర నవాంశలోనున్న రాజుకు బంధువగును.

9. వర్గోత్తమములోనున్న అనుకూలమైన భార్య లభించును.

10. శత్రురాశిలో నున్న నృశంస స్వభావము కలవాడగును.

11. శత్రు నవాంశలోనున్న రోమహీన శరీరము కలవాడగును. శరీరముపై వెంట్రుక లుండవు..

12. స్వరాశిలో నున్న జాతకుడు ధనహీనుడగును.

**షష్టమభావగత శని ఫలము :-**

**నవాల్పారి: జితరిపు: నత: ఖల నృశంసక:**
**కృషికృచ్చైవ అమ్బష్ఠ: వణిక: బహుధర్మకృత్** 15
**గతార్థ: పాప కృద్ద్వేషి పుత్రదారుణ నర్తక:**
**భూయోఽ రిదో రవి: స్వోచ్చమన్దారౌ తనుశత్రుదౌ** 16

1. శని షష్ఠమభావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు శత్రువులపై ఆధిక్యము చూపించును.
2. ఉచ్చనవాంశలో నున్న శత్రువులను పరాజితులను చేయును..
3. శుభ షడ్వర్గములోనున్న వినయముతో నుండును.
4. నీచరాశిలోనున్న జాతకుడు దుష్టస్వభావము కలవాడగును.
5. నీచనవాంశలోనున్న నృశంసు (క్రూరుడు. నిర్దయుడు)డగును.
6. పాప షడ్వర్గులోనున్న వ్యవసాయమునందాసక్తి కలవాడగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు వర్ణసంకరుడగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు వ్యాపారము చేయును.
9. వర్గోత్తమములోనున్న ధార్మిక మనస్తత్వము కలవాడగును.
10. శత్రురాశిలో నున్న ధనహీనుడు, పాపి, ద్వేషము కలవాడగును.
11. శత్రు నవాంశలోనున్న కఠోర స్వభావము కలిగిన పుత్రులు కలిగియుండును.
12. స్వరాశిలో నున్న జాతకుడు నర్తకుడగును.



## షష్ఠమ భావస్థిత గ్రహఫల చక్రము

| గ్రహముల ద్వాదశ స్థితి | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| స్వోచ్ఛ | ఉచ్ఛ వ్యక్తి | వైజ్ఞానిక | నీచ | దు:ఖి | బహు పుత్ర | విజేత | బహు శత్రు |
| సోచ్ఛ నవాంశ | బ్రాహ్మణ సదృశ | పరదార | నీచ కు లోత్పన్న | కురూప | మంత్ర హీన | విజయ | శత్రు విజేత |
| శుభవర్గు | రాజు | శాసక | పరదేశ వాసి | లోక ప్రియ | స్త్రీ వశుడు | రక్తవర్ణ (శస్త్రధారి) | వినమ్ర |
| నీచ రాశి | దుష్ట | వైరజ్ఞ | అంత్యజ | వ్యాకుల దృష్టి | సేవక | ప్రణతా హిత | దుష్ట |
| నీచ నవాంశ | స్త్రీప్రేమి | వైరజ్ఞ | కృషక | అంగ హీన | మద్య పాని | బహుపుత్రి వాన్ | ఖలుడు |
| క్రూరషడ్వర్గు | పరత ర్కక | స్వజాతి పోషక | ధన హీన | ద్వంద్వ హీన | గుణ హీన | వాహన స్వామి | కృషి కర్త |
| మిత్రరాశి | వాహన ప్రేమి | భూమి రక్షక | పుత్ర వాన్ | పరా మర్శి | ప్రసిద్ధ | పాపి | వర్ణ సంకర |
| మిత్ర నవాంశ | గోపాలక | రాజపుత్ర సమాన | బంధు యుక్త | అధికారి పుత్ర | విఖ్యాత | రాజు మిత్రత | వ్యాపారి |
| వర్గోత్తమం | అల్ప శిల్పి | నృశంస | మాతుల ప్రేమ | పరస్త్రీ రత | సుస్వర | సుఖ జీవనము | అధిక శ్రమ |
| శత్రురాశి | కామినీ పుత్ర | విక్రాంత | జూదరి | పరధనా పహ | మంగల హీన | క్రూర | ధనహీన పాపకర్మ |
| శత్రు నవాంశ | కులటా పుత్ర | ముఖ్య | శస్త్ర ధారి | నిర్దయి | వినయ రహిత | రోమ హీన | కఠోర పుత్ర |
| స్వరాశి | విలాసీ పుత్ర | గురు భక్త | సాహస ప్రియ | వ్యసనీ | బహు పుత్ర | ధన హీన | నర్తక |

**కశ్యపజాతకములోని అష్టమాధ్యాయము సమాప్తము**

# 9. నవమాధ్యాయము

## సప్తమభావగత గ్రహముల ఫలము

**గ్రహముల ద్వాదశస్థ ఫల కథనము :**

**స్వోచ్చే స్వోచ్చనవాంశే వా శుభవర్గోఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రభే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరిభేర్యంశే స్వర్క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలం సప్తమ భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

మహర్షి చ్యవనముని వచనానుసారము 1.స్వోచ్చరాశి 2.స్వోచ్చనవాంశ 3. శుభషడ్వర్గు 4. నీచరాశి 5. నీచనవాంశ 6. పాపషడ్వర్గు 7. మిత్రరాశి 8. మిత్ర నవాంశ 9. వర్గోత్తమము 10.శత్రురాశి 11.శత్రు నవాంశ 12.స్వరాశిగత గ్రహముల ఫలమును చ్యవనమతాను సారము తెలుపబడుతున్నది.

**సప్తమ భావస్థ ద్వాదశవిధ రవి ఫలము :-**

**భార్యాకలిప్రియా నిత్యం పరధర్మైక తత్పరా**
**దరిద్రబన్ధకీ రుగ్ణా వశీలా ఘాతతత్పరా 3**
**హీనవిత్తాప్రియరతి వ్యసనా స్వత్వ కృత్యభృక్**
**సాహసైకప్రియా సూర్యే భార్యా స్యాద్ద్యూనభావగే 4**

1. రవి సప్తమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుని భార్య కలహప్రియురాలగును.
2. స్వోచ్చనవాంశలో నున్న జాతకుని పత్ని తన కులపరంపరను వదిలి పరధర్మము నందాసక్తి కలిగియుండును.
3. శుభ షడ్వర్గములోనున్న జాతకుని పత్ని దరిద్రురాలగును.
4. నీచరాశిలోనున్న జాతకుని భార్య బంధకి (ఇతర పురుషుని యందాసక్తి కలిగి యుండునది) యగును.
5. నీచనవాంశలోనున్న జాతకుని భార్య రోగములతో పీడితురాలగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని భార్య శీలరహితురాలగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని భార్య బాధించునదగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుని భార్య ధనహీనురాలగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని భార్య పతిప్రియ యగును.

10. శత్రురాశిలో నున్న జాతకుని భార్య వ్యసనపరురాలగును.

11. శత్రు నవాంశలోనున్న జాతకుని భార్య తన స్వశక్తితో జీవించునదగును.

12. స్వరాశిలో నున్న జాతకుని భార్య సాహసవంతురాలగును

**సప్తమభావగత చంద్ర ఫలము :-**

**రూపసౌభాగ్య సంయుక్తా ప్రియవక్తా స్వరూపభాన్**
**రోహిణీ గుహ్యగోగాఢ్యా పతిద్రోహ పరాయణా: 5**
**ప్రియవాక్యా వినీతా చ ధర్మిష్ఠా దుష్టచేష్టితా**
**గుప్తప్రభావా బహుకృత్య దక్షాఽస్తగే విధౌ 6**

1. చంద్రుడు సప్తమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుని భార్య రూపవతి సౌభాగ్యవతి యగును.
2. స్వోచ్చనవాంశలో నున్న జాతకుని భార్య మధురముగా మాట్లాడును.
3. శుభరాశి వర్గములోనున్న భార్య సుందరి యగును.
4. నీచరాశిలోనున్న జాతకుని భార్య రోగ పీడితురాలగును.
5. నీచనవాంశలోనున్న జాతకుని భార్య గుప్తరోగము కలిగియుండును.
6. పాప షడ్వర్గులోనున్న పత్ని పతిద్వేషియగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని భార్య ప్రియముగా మాట్లాడును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుని భార్య వినయముతో నుండును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని భార్య ధర్మపరాయణురాలగును.
10. శత్రురాశిలో నున్న జాతకుని భార్య దుష్టకార్యములు చేయును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుని భార్య గుప్త ప్రభావముతో కార్యము నెరవేర్చును.
12. స్వరాశిలో నున్న జాతకుని భార్య కార్యములు చేయుటయందు నిపుణురాలగును.

**సప్తమభావగత కుజ ఫలము :-**

**ధనరూపోజ్ఝితా వాతరూపాఖ్యాత ప్రభావకా**
**పుంశ్చలీ కామభూయోఽరి: స్వవర్గపరివర్జితా: 7**
**లగ్ననేత్రే స్వల్పకేశా ప్రభుత్వపరివర్జితా**
**క్రూరస్వభావా హృత్ సుహృత్ బన్ధకీ ద్యూనగే కుజే 8**

1. కుజుడు సప్తమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుని భార్య ధనహీనురాలు, కురూపియగును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుని భార్య వాతరూపములోనుండును..

3. శుభ వర్గులోనున్న జాతకుని భార్య అధిక ప్రభావము కలిగినదగును.
4. నీచరాశిలోనున్న జాతకుని భార్య పుంశ్చలియగును.(వ్యభిచారి)
5. నీచనవాంశలోనున్న జాతకుని భార్యకు శత్రువు అధికముగానుండును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని భార్య తనవర్గము వారికి దూరముగానుండును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని భార్యకు చిన్న కేశములుండును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుని పత్ని నేత్రములు చిన్నవిగా నుండును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని భార్య అసమర్ధురాలయగును.
10. శత్రురాశిలో నున్న జాతకుని భార్య క్రూర స్వభావురాలగును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుని భార్య తన స్నేహితురాలకు దూరముగా నుండును.
12. స్వరాశిలోనున్న జాతకుని భార్య ఇతర పురుషునితో(బంధకి) ఆసక్తి కలిగి యుండును.

**సప్తమభావగత బుధ ఫలము :-**

**సురూప రోగనిర్ముక్తా మణ్డనైక పరాయణా**
**కుపురుషేష్వనురక్తా చ వ్యసనాఢ్యా గుణోజ్ఝితా** **9**
**బహుపుత్రాథ బహ్వ్యజ్ఞయానాసక్తా చ సుప్రభా**
**అర్థహీనా జనేష్టా చ జ్ఞేఽస్తగే స్యాత్సదా వధూ** **10**

1. బుధుడు సప్తమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుని భార్య సుందరి యగును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుని భార్య రోగ రహితురాలగును.
3. శుభరాశి వర్గములోనున్న జాతకుని పత్ని ఎల్లప్పుడు అలంకారములతో నుండును.
4. నీచరాశిలోనున్న జాతకుని భార్య నీచ పురుషునియందాసక్తి కలిగియుండును.
5. నీచనవాంశలోనున్న జాతకుని పత్ని వ్యసన పరురాలగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని పత్ని సద్గుణవతియగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని పత్ని అధిక పుత్రులు కలిగియుండును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుని భార్య అధిక ఆహారమును భుజించునదగును. ప్రయాణా సక్తురాలగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని భార్య కాంతిమతియగును.
10. శత్రురాశిలో నున్న జాతకుని భార్య ధనహీనురాలగును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుని భార్య నిర్ధనురాలగును.
12. స్వరాశిలో నున్న జాతకుని భార్య బంధువులందరికి ప్రియురాలగును.

**సప్తమభావగత గురు ఫలము :-**

**ప్రియలోకా సౌఖ్యయుతా సుకులోత్థా కువంశజా**
**మానినీపిశునా క్రూర బహుమిత్రైశ్చ సంయుతా 11**
**మణిమౌక్తికసంయుక్తా శుచిశ్చ చఞ్చలా తథా**
**కఠోరవాక్యాతిగుణా గురౌ జాతా ద్యూనస్థితే 12**

1. గురుడు సప్తమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుని భార్య అందరికి ప్రియముగా నుండును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుని భార్య సుఖవంతురాలగును.
3. శుభరాశి వర్గములోనున్న జాతకుని భార్య మంచి కులములో జన్మించినదగును.
4. నీచరాశిలోనున్న జాతకుని భార్య నీచ కులములో పుట్టినదగును.
5. నీచనవాంశలోనున్న జాతకుని భార్య చాడీలు చెప్పునదగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని భార్య క్రూరురాలగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని భార్య అధికమైన స్నేహితురాళ్ళు కలిగినదగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుని భార్య మణి మౌక్తికములతో కూడియుండును,
9. వర్గోత్తమములోనున్న జాతకుని భార్య ఆచారవంతురాలగును.
10. శత్రురాశిలో నున్న జాతకుని భార్య చంచల స్వభావము కలిగి యుండును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుని భార్య కఠోర వచనములు పలుకునదగును.
12. స్వరాశిలో నున్న జాతకుని భార్య అత్యంత గుణవతి యగును.

**సప్తమభావస్థిత శుక్ర ఫలము :-**

**బహుమిత్రాన్వితా ద్విజదేవ భక్తా పతివ్రతా**
**అప్రసన్నా కునేత్రా చ నిర్ఘృణా సుభగా తథా 13**
**శుద్ధచిత్తా జనేష్టా చ సుతరాగ వివర్జితా**
**దుష్ట స్వభావా వినతా శుక్రే భార్యా ద్యునస్థితే 14**

1. శుక్రుడు సప్తమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుని భార్య అనేక మంది స్నేహితురాళ్ళను కలిగియుండును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుని భార్య దేవ బ్రాహ్మణ భక్తి కలిగియుండును.
3. శుభరాశి వర్గములోనున్న జాతకుని భార్య పతివ్రతయగును.
4. నీచరాశిలోనున్న జాతకుని భార్య ఎప్పుడు అనుకూలరహితమైన మనస్సుతో నుండును. ఎల్లప్పుడు చిరాకుతో నుండును.

5. నీచనవాంశలోనున్న జాతకుని భార్య కునేత్రియగును..
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని భార్య దయారహితురాలగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని భార్య సౌభాగ్యవతి యగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుని భార్య స్థిరమైన మనస్తత్వము కలిగినదగును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని భార్య లోక ప్రియురాలగును.
10. శత్రురాశిలో నున్న జాతకుని భార్య తన పుత్రులతో ప్రేమతో నుండదు.
11. శత్రు నవాంశలో నున్న జాతకుని భార్య దుష్టస్వభావము కలిగియుండును.
12. స్వరాశిలో నున్న జాతకుని భార్య వినయ స్వభావము కలిగియుండును.

**సప్తమభావగత శని ఫలము :-**

**స్థూలా కృష్ణా శుద్ధభావా కాలాలాక్షీ చాధర్మయుతక్**
**పర రక్తా కోపనా చనిర్గుణా పిశునా తథా 15**
**పాపనిన్ద్యా౽థ విధనా శనౌ భార్యాద్యునస్థితే**
**పాపేన్దుజ్ఞేజ్య శుక్రస్తాః కృద్విత్ర్యబ్ధీషు సంఖ్యకా 16**

1. శని సప్తమభావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుని భార్య స్థూల శరీరముతో నుండును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుని భార్య నలుపురంగుతో నుండును.
3. శుభ వర్గములోనున్న జాతకుని భార్య మంచి స్వభావము కలిగియుండును.
4. నీచరాశిలోనున్న జాతకుని భార్య నలుపు రంగు కలిగియుండును.
5. నీచనవాంశలోనున్న జాతకుని భార్య ధర్మ పరాయణురాలగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుని భార్య పరపురుషుని యందు ఆసక్తి కలిగియుండును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని భార్య కోపస్వభావురాలగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుని భార్య సామాన్యముగా నుండును.
9. వర్గోత్తమములోనున్న జాతకుని భార్య చాడీలు చెప్పునదగును.
10. శత్రురాశిలో నున్న జాతకుని భార్య పాపకర్మలందు ఆసక్తి కలిగియుండును.
11. శత్రు నవాంశలోనున్న నిందిత స్వభావురాలగును.
12. స్వరాశిలో నున్న జాతకుని భార్య దీనహీనురాలగును.



## సప్తమభావస్థ గ్రహఫల చక్రము ( పత్ని )

| గ్రహముల ద్వాదశ స్థితి | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| స్వోచ్ఛ | కలహ ప్రియ | రూప వతి | ధన హీన | సురూప | లోక ప్రియ | బహు మిత్ర | స్థూల |
| సోచ్ఛ నవాంశ | ధర్మ వతి | ప్రియం వద | వాయు రూప | రోగ హీన | సౌఖ్య యుత | ద్విజదేవ భక్త | కృష్ణ |
| శుభవర్గ | దరిద్ర | రూపి | యశస్వి | సుమం డిత | సుకు లోత్థ | పతి వ్రత | శుద్ధ భావ |
| నీచ రాశి | బంధకి | రోహిణి | పుం శ్చలి | కుపురు షానురక్త | కువం శజ | అప్ర సన్న | కరా లాంగి |
| నీచ నవాంశ | రుగ్ణ | గుప్త రోగిణి | కామార్త | వ్యసని | మానిని | కునేత్ర | ధర్మ హీన |
| పాపవర్గ | విశీల | పతి ద్వేషిణి | శత్రు స్వరూప | గుణ రహిత | పిశున | నిర్ఘృన | పర రక్త |
| మిత్రరాశి | ఘూత తత్పర | ప్రియ వాక్య | స్వర్ణ హీన | బహు పుత్ర | బహు మిత్ర | సుభోగ | కోపన |
| మిత్ర నవాంశ | ధన హీన | వినీత | స్వల్ప కేశ | బహు భక్ష | ధనాఢ్య | శుద్ధచిత్త | నిర్గుణ |
| వర్గోత్తమం | రతి ప్రియ | ధర్మిష్ఠ | ప్రభుత్వ హీన | సుప్రభ | పవిత్ర | జనేష్ట | పిశున |
| శత్రురాశి | వ్యసన | దుష్ట స్వభావ | క్రూర | అర్థ హీన | చంచల | పరస్నేహ హీన | పాపి |
| శత్రు నవాంశ | ఆత్మ నిర్భర | గుప్త ప్రభావ | సుఖ హీన | ధన హీన | కఠోర వచన | దుష్ట స్వభావ | నింధ్య |
| స్వరాశి | సాహసి | బహు కృత్య | బంధకి | జన ప్రియ | అతి గుణ | వినమ్ర | ధన హీన |

**కశ్యపజాతకములోని అష్టమాధ్యాయము సమాప్తము**

# 10. దశమాధ్యాయము

## అష్టమభావఫలాధ్యాయము

**గ్రహముల ద్వాదశస్థ ఫల కథనము :**

**స్వోచ్చే స్వోచ్చనవాంశే చ శుభవర్గేఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రభే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరిభేర్యంశే స్వర్క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలం అష్టమ భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

మహర్షి చ్యవనముని వచనానుసారము 1.స్వోచ్చరాశి 2.స్వోచ్చనవాంశ 3.శుభ షడ్వర్గు 4.నీచరాశి 5.నీచనవాంశ 6. పాపషడ్వర్గ 7. మిత్రరాశి 8. మిత్ర నవాంశ 9. వర్గోత్తమము 10.శత్రురాశి 11.శత్రు నవాంశ 12.స్వరాశులలోనున్న గ్రహముల అష్టమభావ ఫలములు చ్యవనఋషి మతానుసారము తెలుపబడును.

**అష్టమభావస్థిత గ్రహఫలము :-**

**భక్తిజాగ్ని ప్రవేశేన జనహ్రీత: ప్రమాదత:**
**దావాగ్నితో దమ్భకృత్యోద్దీపనేన విషాదనాత్ 3**
**బన్ధనాచ్చైవ లోహచ్చ రక్తకోపాత్తథైవ చ**
**క్షయకాసాత్ స్త్ర్యపరాధన్మృత్యుర్మృత్యుగతే రవౌ 4**

1. రవి అష్టమ భావములో స్వోచ్చరాశిలో నున్నపుడు జాతకుడు అగ్నిలో ప్రవేశించి తన శరీరమును అంతము కావించును.
2. ఉచ్చనవాంశలో నున్న జనుల మధ్య సిగ్గుతో మరణించును.
3. శుభ వర్గులోనున్న ప్రమాదము వలన మృత్యువు కలుగును.
4. నీచరాశిలోనున్న నీచ వ్యక్తి, దావానలము వలన మరణము కలుగును.
5. నీచనవాంశలోనున్న పాఖండ కార్యముల వలన మరణించును.
6. పాప షడ్వర్గులోనున్న ఆడంబరముతో కూడిన పనుల వలన మరణించును.
7. మిత్రరాశిలోనున్న జాతకునికి విషభక్షణము వలన మృత్యువు కలుగును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకునికి కారాగారము వలన మృత్యువు కలుగును.
9. వర్గోత్తమ నవాంశలోనున్న జాతకునికి లోహపు ఆయుధము వలన మృత్యువు కలుగును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు రక్త ప్రకోపము వలన మృత్యువు కలుగును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు క్షయరోగము వలన మరణించును.

12.స్వరాశిలో నున్న జాతకుడు తన భార్య అపరాధము చేయుట వలన మరణించును.

**అష్టమభావగత చంద్ర ఫలము :-**

**జలప్రవేశాద్ హస్తిభిర్ఘాతా దశనిపాతత:**
**స్త్రీ హస్తాత్ పిత్తకఫతో దోషత్రయ భవామయాత్ 5**
**జఠరాద్ గుదరోగాశ్చ పశుపాదాభి ఘాతత:**
**గుదరోగా చ్ఛృఙ్గ ఘాతాత్ క్షయాత్ చన్ద్రేఽ ష్టమే మృతి: 6**

1. చంద్రుడు అష్టమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు జలములో ప్రవేశించుట వలన మరణించును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు ఏనుగుల వలన మరణము పొందును.
3. శుభ షడ్వర్గులోనున్న విద్యుత్తు వలన మరణించును.
4. నీచరాశిలోనున్న జాతకుడు నీచ స్త్రీ చేతులలో మరణించును.
5. నీచనవాంశలోనున్న కఫ పిత్తదోషముల వలన మృత్యువు కలుగును.
6. పాప షడ్వర్గులోనున్న సన్నిపాత దోషము వలన మరణించును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు జఠరరోగము వలన మరణించును.
8. మిత్ర నవాంశలోనున్న గుద రోగము వలన మరణించును.
9. వర్గోత్తమ నవాంశలోనున్న జాతకుడు పశువులు తన్నుట వలన మరణించును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు గుద రోగము వలన మరణించును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు గుద రోగము వలన మరణించును.
12. స్వరాశిలో నున్న జాతకుడు క్షయరోగము వలన మరణించును.

**అష్టమభావగత కుజ ఫలము :-**

**సఙ్గ్రామాద్ గోగ్రహణత: స్వహస్తాన్నిజ శస్త్రత:**
**ద్విజపార్శ్వాద్ అశ్వఘాతాత్ కాష్ఠాత్కూప ప్రపాతత: 7**
**భృగుపాతాద్ గుప్తరోగాద్ విషభక్షణ తస్తథా**
**చౌరప్రహారణాత్ భౌమే మృత్యు: స్యాన్మృత్యుభావగే 8**

1. కుజుడు అష్టమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు యుద్ధము చేయుట వలన మరణించును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు గోవుల వలన మృత్యువును పొందును.
3. శుభ వర్గులోనున్న జాతకుడు స్వయముగా ఆత్మహత్యకు పాల్పడును.
4. నీచరాశిలోనున్న శస్త్రాస్త్రముల వలన మృత్యువు కలుగును.
5. నీచనవాంశలోనున్న బ్రాహ్మణాదుల సంపర్కము వలన, దంతముచే కొరుకుట

వలన మృత్యువు కలుగును.

6. పాప షడ్వర్గులోనున్న రాయి తగులుట వలన మరణించును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు కర్ర తగులుట వలన మరణించును.
8. మిత్ర నవాంశలోనున్న కూపాదులలో దూకుట వలన మరణించును.
9. వర్గోత్తమ నవాంశలోనున్న కొండపైనుండి క్రిందికి పడుట వలన మృత్యువు కలుగును.
10. శత్రురాశిలో నున్న గుప్త రోగము వలన జాతకునికి మృత్యువు కలుగును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు విషభక్షణ వలన మృత్యువు కలుగును.
12. స్వరాశిలో నున్న జాతకుడు దొంగల వలన మృత్యువును పొందును.

**అష్టమభావగత బుధ ఫలము :-**

**జ్వరాత్ కఫ వికారేభ్యో వాతరోగాద్ వ్రణేన చ**
**మహాభయాత్ ప్రియజనవియోగాద్ వదనామయాత్** 9
**నేత్రరోగాత్ పాయురోగాద్ బన్ధనే నోదరామయాత్**
**పాద వ్రణాద్ బుధే మృత్యు ర్మృత్యుస్థాన గతే క్రమాత్** 10

1. బుధుడు అష్టమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు జ్వరము వలన మృత్యువును పొందును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు కఫరోగము వలన మరణించును.
3. శుభ వర్గులోనున్న జాతకుని మృత్యువు వాతరోగము వలన కలుగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు వ్రణరోగము వలన మృత్యువును పొందును.
5. నీచనవాంశలోనున్న జాతకునికి అధిక భయము వలన మృత్యువు కలుగును.
6. పాపషడ్వర్గులోనున్న జాతకుడు ప్రియజనుల వియోగమువలన మృత్యువును పొందును.
7. మిత్రరాశిలోనున్న శారీరక రోగము వలన మరణము కలుగును.
8. మిత్ర నవాంశలోనున్న నేత్రరోగము వలన మృత్యువు కలుగును.
9. వర్గోత్తమ నవాంశలోనున్న జాతకుడు ఉదరరోగము వలన మృత్యువు కలుగును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు గుద రోగము వలన మృత్యువు కలుగును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు ఉదరరోగము వలన మరణించును.
12. స్వరాశిలో నున్న జాతకుడు వ్రణము (దెబ్బ) వలన మరణించును.

**అష్టమభావగత గురు ఫలము :-**

**నానారోగై: స్థూలరోగై: కర్ణరోగస్తథైవ చ**

స్వజనాద్ విషూచికాతోఽ తిసారాశ్చ నిజభృత్యజ: 11
రక్తకోపాత్ కరభత: స్వకేశదూర్ధ్వ కోపత:
బహుభక్షణతో మృత్యుర్జీవే స్యాన్మృత్యుభావగే 12

1. గురుడు అష్టమ భావములో ఉచ్చరాశిలో నున్న జాతకుడు అనేక రోగములతో మృత్యువును పొందును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు చాలా పెద్దరోగము వచ్చుట వలన మృత్యువును పొందును.
3. శుభ వర్గులోనున్న జాతకుడు చెవిరోగము వలన మరణించును.
4. నీచరాశిలోనున్న జాతకుడు స్వజనుల వలన మృత్యువును పొందును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు విషూచికము వలన మరణించును.
6. పాప షడ్వర్గులోనున్న అతిసారవ్యాధి వలన మృత్యువును పొందును.
7. మిత్రరాశిలోనున్న తన సేవకుని వలన మరణించును.
8. మిత్ర నవాంశలోనున్న రక్తప్రకోపము వలన మృత్యువు కలుగును.
9. వర్గోత్తమ నవాంశలోనున్న ఒంటె వలన మృత్యువు కలుగును.
10. శత్రురాశిలో నున్న తన కేశముల వలన మృత్యువు కలుగును.
11. శత్రు నవాంశలోనున్న అతిక్రోధము వలన శిరములో రక్తస్రావమై మరణించును.
12. స్వరాశిలో నున్న అధిక భోజనము వలన మృత్యువు కలుగును.

**అష్టమభావగత శుక్ర ఫలము :-**

తృష్ణయా ముఖరోగాశ్చ దన్తదోషాద్ త్రిదోషత:
విషూచ్చా వనసత్వేన భుజఙ్గాద్ విషభక్షణాత్ 13
లూతయా విషకణ్ఠేన సురతోత్థ ప్రకోపత:
బహుదు:ఖాద్ భవేణ్మృత్యు మృత్యు భావగతే భృగౌ 14

1. శుక్రుడు అష్టమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు అధిక దాహము కలుగుట వలన మరణించును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు ముఖరోగము వలన మరణించును.
3. శుభ షడ్వర్గులోనున్న జాతకుడు దంతరోగము వలన మృత్యువు కలుగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు త్రిదోషము (వాత పిత్త కఫములు) వలన మృత్యువు కలుగును.
5. నీచనవాంశలోనున్న విసూచిక వలన మృత్యువు కలుగును.
6. పాప షడ్వర్గులోనున్న వన్యజీవుల (సింహ వ్యాఘ్రాదులు) వలన మృత్యువు

కలుగును.

7. మిత్రరాశిలోనున్న సర్పము వలన మృత్యువు కలుగును.
8. మిత్ర నవాంశలోనున్న విషభక్షణము వలన మృత్యువు కలుగును.
9. వర్గోత్తమములో నున్న లూత (పురుగు)వలన మృత్యువు కలుగును.
10. శత్రురాశిలో నున్న నీలకంఠము వలన జాతకుడు మృత్యువు పొందును.
11. శత్రు నవాంశలోనున్న అధిక క్రోధము వలన మృత్యువు కలుగును.
12. స్వరాశిలో నున్న జాతకుడు దు:ఖము వలన మృత్యువును పొందును.

**అష్టమభావగత శని ఫలము :-**

**బుభుక్షయా లఙ్ఘనేన తథా ప్రాయోపవేశనాత్**
**బన్ధువర్గాదరికరాత్ క్షయేణ పృథుదద్రుత: 15**
**బటుకై: వ్రణ కోపేన హయపాదాభిఘాతత:**
**హస్తిత: ఖతరో మృత్యుర్మన్దే స్యాన్మృత్యుభావగే 16**

1. శని అష్టమ భావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు ఆకలి వలన మరణించును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు లంఘనము వలన మృత్యువును పొందును.
3. శుభ వర్గులోనున్న జాతకుడు ఉపవాసము వలన మృత్యువు పొందును.
4. నీచరాశిలోనున్న జాతకుడు బంధు వర్గము వలన మృత్యువు పొందును.
5. నీచనవాంశలోనున్న శత్రువుల వలన మృత్యువు పొందును.
6. పాప షడ్వర్గులోనున్న క్షయరోగము వలన మృత్యువు కలుగును.
7. మిత్రరాశిలోనున్న అధికముగా దద్రు (రోగ విశేషము)వగుట వలన మరణించును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు బాలుని వలన మృత్యువును పొందును.
9. వర్గోత్తమ నవాంశలోనున్న వ్రణము వలన మృత్యువు కలుగును.
10. శత్రురాశిలో నున్న గుర్రముల కాళ్ళు తగులుట వలన జాతకునికి మృత్యువు కలుగును.
11. శత్రు నవాంశలోనున్న ఏనుగు త్రొక్కుట వలన మరణించును.
12. స్వరాశిలో నున్న గాడిద తన్నుట వలన మరణించును.




## అష్టమభావగత గ్రహ ద్వాదశ ఫలము (మృత్యువు)

| గ్రహముల ద్వాదశ స్థితి | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| **స్వోచ్చ** | భక్తిపూర్వక అగ్నిప్రవేశం | జలప్రవే శము | యుద్ధము | జ్వరము | నానా రోగము | దప్పిక | ఆకలి |
| **సోచ్చ నవాంశ** | లోక లజ్జ | భారీ వా హనము | పశువు | కఫ రోగము | స్థూల రోగము | ముఖ రోగము | లంఘ నము |
| **శుభవర్గు** | ప్రమా దము | విద్యుత్తు | ఆత్మ హత్య | వాత రోగము | కర్ణ రోగము | దంత రోగము | ఉప వాసము |
| **నీచ రాశి** | దావాగ్ని | స్త్రీ హస్తము | ఆత్మ హత్య | వ్రణము | స్వ వర్గము | వికత్రిదోషము | బంధు వర్గము |
| **నీచ నవాంశ** | దాంబి కము | పిత్త కఫ | బ్రాహ్మణ దంత | మహా భయము | విషూచిక | విషూచిక | శత్రువు |
| **క్రూరషడ్వర్గు** | అన్యులు | త్రిదో షము | రాయి | ప్రియ | అతి జనము | వన్య జీవము | క్షయ జీవి |
| **మిత్రరాశి** | విష భక్షణము | ఉదర రోగము | కాష్ఠము | రోగము | సేచకుడు | సర్పము | దద్రు |
| **మిత్ర నవాంశ** | బంధ నము | గుద రోగము | కూపా దులు | నేత్ర రోగము | రక్త ప్ర కోపము | విష భ క్షణము | బాల కుడు |
| **వర్గోత్తమం** | లోహము | పశుపాద ఘాతము | గిరి పతనము | గుద రోగము | ఒంటె | లూత | వ్రణము |
| **శత్రురాశి** | రక్త ప్రకో పము | గుద రోగము | గుప్త రోగము | బంధ నము | కేశ ములు | విష కంఠము | హ్రస్వము |
| **శత్రు నవాంశ** | క్షయ | కొమ్ము | విష భక్షణము | ఉదర రోగము | ఊర్ధ్వ కోపము | క్రోధము | ఏనుగు |
| **స్వరాశి** | స్త్రీ | క్షయ రోగము | దొంగ | పాద వ్రణము | బహు బక్షణము | బహు దు:ఖము | గాడిద |

## కశ్యపజాతకములో దశమాధ్యాయము సమాప్తము

# 11. ఏకాదశాధ్యాయము

## నవమ భావఫలాధ్యాయము

**గ్రహముల ద్వాదశస్థ ఫల కథనము :**

**స్వోచ్చే స్వోచ్చనవాంశే వా శుభవర్గోఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రభే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరిభేర్యంశే స్వర్క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫల నవమ భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

మహర్షి చ్యవనముని వచనానుసారము 1.స్వోచ్చరాశి 2.స్వోచ్చనవాంశ 3.శుభ షడ్వర్గు 4.నీచరాశి 5. నీచనవాంశ 6. పాపషడ్వర్గు 7. మిత్రరాశి 8. మిత్ర నవాంశ 9.వర్గోత్తమము 10.శత్రురాశి 11.శత్రు నవాంశ 12.స్వరాశి. ఈపన్నెండు స్థితులలోను గ్రహ ఫలములు తెలుపబడుతున్నవి.

**నవమ భావస్థిత రవి ఫలము :-**

**తామసో దమ్భజోహీనోనైవదుష్ట: పరాశ్రిత:**
**పిశునాశ్రయ సఞ్జాత: పాపజ: తిలభుక్తయా 3**
**కృతఘ్న: భాషితశ్చోర: సాశ్రిత: పిశునాశ్రిత:**
**ధర్మోనవమగే సూర్యే జన్మినాం పరిశీల్యతే 4**

1. రవిఉచ్చరాశిలో నవమభావములో నున్న జాతకుడు తాపసీ ధర్మమును అనుసరించును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు ఆడంబరముగా ధర్మకార్యములను చేయును.
3. శుభ వర్గులోనున్న తన హీనత్వమును కప్పిపుచ్చుకొనుటకు ధర్మకార్యములను చేయును.
4. నీచరాశిలోనున్న ధర్మహీనుడగును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు ఇతరులను ఆశ్రయించి ధర్మకార్యములను చేయును.
6. పాప షడ్వర్గులోనున్న చాడీలు చెప్పువారి సలహాలతో ధర్మకార్యములను చేయును.
7. మిత్రరాశిలోనున్న పాపకార్యముల వలన సంపాదించిన ధనముతో ధర్మకార్యములను చేయును.
8. మిత్ర నవాంశలోనున్న తన పొట్టను కట్టుకొని ధర్మకార్యములు చేయును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు కృతఙ్ఞుడగును.
10. శత్రురాశిలో నున్న దొంగమాటలతో ధర్మకార్యమును చేయును..
11. శత్రు నవాంశలోనున్న దొంగల నాశ్రయించి ధర్మకార్యములు చేయును.
12. స్వరాశిలో నున్న చాడీలు చెప్పువారితో కలిసి ధర్మకార్యములు చేయును.

**నవమభావగత చంద్ర ఫలము :-**

**నృపసంజ్ఞాద్ బ్ధు జనాద్ విశ్వాసాత్ పితృతర్పణాత్**
**అత్యల్ప ఫలదానాద్వా భ్రమేణ పర వఞ్చనాత్ 5**
**అన్యదైవత సంజ్ఞేన లోక సజ్ఞాన్ మదేన చ**
**అన్యసజ్ఞాత్ శత్రుసేవాద్ భవేద్దానాత్తపే విధౌ 6**

1. చంద్రుడు ఉచ్చరాశిలో నవమభావములో నున్న జాతకుడు రాజాధికారులతో కూడి యుండును.
2. ఉచ్చనవాంశలో నున్న బంధువుల సహాయోగము భాగ్యమును పొందును..
3. శుభ వర్గులోనున్న జాతకుడు శ్రాద్ధాదులందు విశ్వాసముండుట వలన భాగ్యోదయ మగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు అల్పమాత్రముగా దానము చేయును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు దూరప్రాంతములకు వెళ్ళుట వలన భాగ్యోదయము కలుగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు పనులను వంచన చేయుట వలన భాగ్యోదయము పొందును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు తనకుల దేవతను వదిలి అన్యదేవతలను పూజించుట వలన భాగ్యమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న అనేకమందితో పరిచయమును పొందుట వలన భాగ్యోదయ మగును.
9. వర్గోత్తమములోనున్న అహంకార పూరితముగా మారకద్రవ్యసేవనము వలన ధనవ్యయము చేయుట వలన భాగ్యోదయమగును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు శత్రువులను సేవించుట వలన భాగ్యమును పొందును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు ఇతరులతో సహవాసము చేయుటవలన భాగ్యమును పొందును.
12. స్వరాశిలో నున్న జాతకుడు దానధర్మములు చేయుటవలన భాగ్యమును పొందును.

**నవమభావగత కుజ ఫలము :-**

**రణజ: పరసేవస్థో గురుపాషాణ సమ్భవ:**
**బధ బన్ధన సమ్భూత: పరస్త్రీలోక సమ్భవ: 7**
**జనానురోధాత్ గర్వాథో భయజోనైవ చాల్పక:**
**పరదర్శనజో భౌమే స్త్రృజితో ధర్మభావగే 8**

1. కుజుడు నవమభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుని భాగ్యోదయము యుద్ధము చేయుట వలన జరుగును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు ఇతరులను సేవించుట వలన భాగ్యమును పొందును.
3. శుభ షడ్వర్గులోనున్న జాతకుడు రాళ్ళవ్యాపారము వలన భాగ్యమును పొందును.
4. నీచరాశిలోనున్న ఇతరులను వధించుట బంధించుట వలన భాగ్యోదయము పొందును.
5. నీచనవాంశలోనున్న ఇతర స్త్రీల వలన భాగ్యోదయము కలుగును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు లోకాలకు ప్రియుడగుట వలన భాగ్యోదయము పొందును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు గర్హితకర్మ చేయుట వలన భాగ్యమును పొందును
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు భయము కలుగుట వలన తగిన విధముగా ప్రతీకారము తీర్చుకొనుట వలన భాగ్యోదయము కలుగును.
9. వర్గోత్తమములోనున్న భాగ్యోదయము తక్కువగును.
10. శత్రురాశిలో నున్న తక్కువ భాగ్యమును పొందును.
11. శత్రు నవాంశలోనున్న ఇతరులననుకరించుట వలన భాగ్యోదయమగును.
12. స్వరాశిలో నున్న జాతకుడు స్త్రీల వలన పరాజయము పొందకుండుట వలన భాగ్యోదయమును పొందును.

**నవమభావగత బుధ ఫలము :-**

**సాత్వికో దేవతా స్థానాత్ పూజాద్ దానసముద్భవ:**
**వ్రతపూత: కపటజ: కుహకోత్థశ్చలోద్భవ: 9**
**గార్హస్థ్యకృజ్జపాద్ వస్త్రదావాద్ ప్రియతోద్భవ:**
**గురుభౌమాద్ సాధ్యసాచ్ఛధర్మ: సౌమ్యే తప: స్థితే 10**

1. బుధుడు నవమభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు సాత్విక ప్రవృత్తి వలన భాగ్యోదయము పొందును.
2. ఉచ్చనవాంశలో నున్న దేవస్థానము వలన భాగ్యమును పొందును.
3. శుభ షడ్వర్గులోనున్న జాతకుడు పూజ చేయుట వలన భాగ్యమును పొందును.
4. నీచరాశిలోనున్న జాతకుడు ఇతరులకు దానము చేయుట వలన భాగ్యము పొందును.
5. నీచనవాంశలోనున్న వ్రతమును చేసి పవిత్రమగుట వలన భాగ్యము కలుగును.
6. పాప షడ్వర్గులోనున్న కపట ప్రవర్తనము వలన భాగ్యోదయమగును.

7. మిత్రరాశిలోనున్న మాయాజాలము వలన భాగ్యమును పొందును.
8. మిత్రనవాంశలోనున్న జాతకుడు చంచల మనస్తత్వము వలన భాగ్యమును పొందును.
9. వర్గోత్తమ నవాంశములోనున్న జాతకుడు గృహస్థులకొరకు జపము చేయుట వలన లేక సేవ చేయుట వలన భాగ్యమును పొందును.
10. శత్రురాశిలో నున్న వస్త్రములు దానము చేయుట వలన భాగ్యమును పొందును.
11. శత్రు నవాంశలోనున్న ఇతరులకు ప్రియుడగుట వలన భాగ్యమును పొందును.
12. స్వరాశిలో నున్న జాతకుడు భయము వలన భాగ్యమును పొందును.

**నవమభావగత గురు ఫలము :-**

**ప్రచరో గురుసేవోత్థో_ త్యద్భుత: కృతకస్తథా**
**తతోగురు విరోధోత్థ: తీర్థజో ధర్మకర్మజ: 11**
**స్త్రీమతేనతత: పుత్రానుషఙ్గాత్ న్యాయవర్జిత:**
**గురుమేషేణ ఘృణయా ధర్మోజీవే తప: స్థితే 12**

1. గురువు నవమభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు ప్రవాసయాణము వలన భాగ్యము పొందును.
2. ఉచ్చనవాంశలో నున్న గురు జనుల వలన భాగ్యమును పొందును.
3. శుభరాశి వర్గులోనున్న జాతకుని భాగ్యోదయము ఆశ్చర్యకరముగానగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు అధిక పరిశ్రమ చేయుట వలన భాగ్యము పొందును.
5. నీచనవాంశలోనున్న గురువుతో విరోధము కలుగుట వలన భాగ్యము కలుగును.
6. పాప షడ్వర్గులోనున్న తీర్థయాత్ర చేయుట వలన భాగ్యోదయమగును.
7. మిత్రరాశిలోనున్న ధర్మకార్యములు చేయుట వలన భాగ్యమును పొందును
8. మిత్రనవాంశలోనున్న భార్యను పరామర్శించుట వలన భాగ్యమును పొందును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు పుత్రుని వలన భాగ్యమును పొందును.
10. శత్రురాశిలో నున్న అన్యాయమైన కార్యములు చేయుట వలన భాగ్యము కలుగును.
11. శత్రు నవాంశలోనున్న అధిక బరువు కలిగిన మేకలనమ్ముట వలన భాగ్యమును పొందును.
12. స్వరాశిలో నున్న ఇతరులకుపకారము చేయుట వలన భాగ్యమును పొందును.

**నవమభావగత శుక్ర ఫలము :-**

**పరదానేన వస్త్రాన్నదానేన పితృతర్పణాత్**
**అత్యల్పఫలదో వృద్ధి భ్రమేణ పరవఞ్చనాత్ 17**
**అన్యదైవతసంజ్ఞేన లోకసఙ్గాత్ సుఖప్రజాత్**
**అన్యసఙ్గాత్ శత్రుసేవాత్ కృష్యాధర్మ: సితేశుభే 18**

1. శుక్రుడు నవమభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు ఇతరులకు దానము చేయుట వలన ధర్మకార్యము చేయును.
2. ఉచ్చనవాంశలో నున్న వస్త్ర అన్నదానములుచేయుటవలన ధర్మకార్యము చేయును.
3. శుభవర్గులోనున్న పితృతర్పణము ద్వారా దానకార్యము చేయును.
4. నీచరాశిలోనున్న జాతకుడు అల్పఫలము నిచ్చు ధర్మమునాచరించును.
5. నీచనవాంశలోనున్న భ్రమించే బుద్ధితో (అవిశ్వాసము) ధర్మకార్యమును చేయును.
6. పాప షడ్వర్గులోనున్న ఇతరులను వంచించి ధర్మకార్యమును చేయును.
7. మిత్రరాశిలోనున్న ఇతర దేవతల కొరకు ధర్మము చేయును.
8. మిత్రనవాంశలోనున్న సమాజముతో కలిసి ధర్మమును చేయును.
9. వర్గోత్తమములోనున్న తన సంతానము వలన లభించిన ధనముతో ధర్మకార్యములను చేయును.
10. శత్రురాశిలో నున్నజాతకుడు ఇతరుల సంపర్కముతో ధర్మము చేయును.
11. శత్రు నవాంశలోనున్న శత్రుసేవ వలన లభించిన ధనముతో ధర్మమును చేయును.
12. స్వరాశిలో నున్న వ్యవసాయము వలన లభించిన ధనముతో ధర్మకార్యములనాచరించును.

**నవమభావగత శని ఫలము :**

**తృతీయవయసం సంజాత: స్వల్పో భుక్తి వివర్జిత:**
**నైరాన్యజ: కపటజ: సర్గహ: భీతిసమ్భవ: 15**
**సేవాసముద్భవోత్యల్ప: పరదర్శన సమ్భవ:**
**గురులబ్ధభవో మన్దే ధర్మే ధర్మో విధీయతే 16**

1. శని నవమభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు వృద్ధావస్థలో ధర్మకార్యము చేయును. భాగ్యోదయమగును.
2. ఉచ్చనవాంశలో నున్న అల్పధర్మము భాగ్యోదయమగును.
3. శుభవర్గులోనున్న భోగరహితుడగును.
4. నీచరాశిలోనున్న ఇతరుల సహకారము లేకుండ స్వయముగా ధర్మకార్యము చేయును.
5. నీచనవాంశలోనున్న కపటపూర్వకముగా ధర్మమును చేయును.
6. పాప షడ్వర్గులోనున్న గర్వితరీతితో ధర్మకార్యమును చేయును.
7. మిత్రరాశిలోనున్న భయముతో ధర్మము చేయును.
8. మిత్రనవాంశలోనున్న సేవాకార్యముతో ధర్మమును చేయును.
9. వర్గోత్తమములోనున్న అత్యల్పముగా ధర్మమును చేయును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు ఇతరులను చూచి ధర్మము చేయును.
11. శత్రు నవాంశలోనున్న ఇతరులకు చూపించుటకు ధర్మము చేయును.
12. స్వరాశిలో నున్న జాతకుడు గురూపదేశము వలన ధర్మకార్యములనాచరించును.

## నవభావగత గ్రహ ద్వాదశ ఫలము (మృత్యువు)

| గ్రహముల ద్వాదశ స్థితి | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| **స్వోచ్ఛ** | తామసీ ధర్మము | రాజా దులు | రణము | సాత్వి కము | ప్రవా సము | పర దానము | వృద్ధావస్థ లోధర్మము |
| **సోచ్ఛ నవాంశ** | దంభకా పూర్వకము | బంధు పూర్వకము | సేవ జనులు | దేవ స్థానము | గురు సేవ | వస్త్రాన్న దానము | స్వల్ప భక్తి |
| **శుభవర్గు** | హీన పదార్థము | పితృ తర్పణము | పాషా ణము | పూజ | అద్భు తము | పితృ త ర్పణము | భోగ ర హితము |
| **నీచ రాశి** | పరోప కారము | అత్యల్ప దానము | వధ బం ధనము | దానము | అధిక శ్రమ | అల్ప ఫలము | స్వీయ ధర్మము |
| **నీచ నవాంశ** | పరాశ్రి తము | భ్రమణము | పరస్త్రీ | వ్రతము | గురు వి రోధము | భ్రమణ బుద్ధి | కపటము |
| **పాపవర్గు** | పిశునా శ్రయము | వంచనము | జనాను రోధము | కపటము | తీర్థ యాత్ర | పర వంచన | గర్వితి రీతి |
| **మిత్రరాశి** | పాపజము | అన్యదైవ పూజ | గర్వితి కార్యము | మాయా జాలము | ధర్మ కార్యము | అన్య దైవము | భయము |
| **మిత్ర నవాంశ** | తిల భుక్కు | లోక సంగము | భయము | చంచ లము | స్త్రీపరా మర్శ | లోక సంగము | సేవా కార్యము |
| **వర్గోత్తమం** | కృతఘ్న | మదము | అల్ప భాగ్యము | జపము | పుత్రులు | సుఖ సంపద | అల్ప ధర్మము |
| **శత్రురాశి** | చౌర భాషితము | అన్య సంగము | అల్పము | వస్త్ర దానము | అన్యా యము | అన్య సంఘము | పరులను చూచి దర్మము |
| **శత్రు నవాంశ** | చోర సంగతి | శత్రు సేవ | పరాను కరణము | పరా ప్రియము | గురు మేష విక్రయము | శత్రు సేన | ఇతరులకు చూపుట |
| **స్వరాశి** | పిశునాశ్రి తము | దానము | స్త్ర్యజితము | భయము | దయా గుణము | కృషి కర్మ | గురూప దేశము |

**కశ్యపజాతకములో ఏకాదశాధ్యాయము సమాప్తము**

# 12. ద్వాదశాధ్యాయము

## దశమ భావఫలాధ్యాయము

**దశమభావగ్రహ ద్వాదశస్థితి :-**

**స్వోచ్చే స్వోచ్చనవాంశే చ శుభవర్గేఽథ నీచగే**
**నీచాంశే క్రూర షడ్వర్గే మిత్రభే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరిభేర్యంశే స్వర్క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలఞ్చ దశమ భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

చ్యవనమతానుసారము దశమభావస్థిత గ్రహములు 1.స్వోచ్చరాశి 2.స్వోచ్చ నవాంశ 3.శుభషడ్వర్గు 4. నీచరాశి 5.నీచనవాంశ 6. పాపషడ్వర్గ 7.మిత్రరాశి 8. మిత్ర నవాంశ 9.వర్గోత్తమము 10.శత్రురాశి 11.శత్రు నవాంశ 12.స్వరాశి. ఈపన్నెండు స్థితులలోను గ్రహ ఫలములు తెలియజేయబడుచున్నవి.

**దశమభావస్థిత రవి ఫలము :-**

**ధర్మవ్రతమయం బన్ధబధసంజ్ఞం కలఙ్కితమ్**
**బహుదాస క్రియారూపం కుభూప భజనాదికమ్ 3**
**బధబన్ధమయం హింస్రం వాణిజ్య మణిజోచితమ్**
**అశుభం గర్హితం వాన్య సేవాకర్మ ఖగేరవౌ 4**

1. రవి దశమభావములో ఉచ్చరాశిలో నున్న జాతకుడు ధర్మనిరతుడు, వ్రతపరాయణు డగును, నైతికముగా జీవించును.
2. ఉచ్చనవాంశలో నున్న ఇతరులను హింసించు కార్యము చేయును.
3. శుభ షడ్వర్గులోనున్న కళంకిత కార్యముల వలన జీవనము చేయును.
4. నీచరాశిలోనున్న సేవకుల సహయోగముతో కార్యమును చేయును.
5. నీచనవాంశలోనున్న దుష్టయజమానిని పొగుడుతు జీవించును.
6. పాప షడ్వర్గులోనున్న వధబంధన కార్యములను చేయును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు ఇతరులను హింసించును.
8. మిత్ర నవాంశలోనున్న వ్యాపారము చేసి జీవించును.
9. వర్గోత్తమములోనున్న ఉన్నతమైన వ్యాపారము చేసి జీవించును.
10. శత్రురాశిలో నున్న అశుభకార్యమును చేయును..
11. శత్రు నవాంశలోనున్న గర్హితకర్మ చేసి జీవించును.
12. స్వరాశిలో నున్న జాతకుడు ఇతరులవద్ద ఉద్యోగము చేయుట వలన జీవించును.

**దశమభావగత చంద్ర ఫలము :-**

**ఖ్యాతం దేవద్విజభవం శుభం లజ్జా సమన్వితమ్**
**క్రయవిక్రయ రూపఞ్చ వ్యసనాఖ్యః శుభాత్మకమ్ 5**
**శాస్త్రజం నఖజం హింస్రం స్త్రీజం నృపతిదైన్యజమ్**
**కర్మభావగతే చన్ద్రే క్రియతే కర్మ జన్తునా 6**

1. చంద్రుడు దశమభావములో ఉచ్చరాశిలో నున్న జాతకుడు ప్రసిద్ధ వ్యక్తియగును. అతని ఖ్యాతి దూరము వరకు వ్యాపించును.
2. ఉచ్చనవాంశలో నున్న దేవ ద్విజకార్యములు శుభకార్యములు చేసి జాతకుడు తన జీవనము సాగించును.
3. శుభ షడ్వర్గులోనున్న జాతకుడు శాస్త్రములో తెల్పిన విధముగా కార్యములు నిర్వహించి జీవనము చేయును.
4. నీచరాశిలోనున్న తాను చేయుకర్మల వలన సిగ్గును పొందును.
5. నీచనవాంశలోనున్న క్రయ విక్రయకార్యములను చేసి జీవించును.
6. పాప షడ్వర్గులోనున్న చెడువ్యసనముల (దొంగతనము, జ్యూదము, వ్యభిచారము) వలన కార్యములను నిర్వహించును.
7. మిత్రరాశిలోనున్న జాతకుని కార్యము వలన శుభము కలుగును.
8. మిత్ర నవాంశలోనున్న శాస్త్రానుసారము జీవనము చేయును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు చిత్రకార వృత్తితో జీవించును.
10. శత్రురాశిలో నున్న హింసాపూరిత కార్యములు చేసి జీవించును.
11. శత్రు నవాంశలోనున్న స్త్రీలకుపయోగపడు కార్యములను చేసి జీవించును.
12. స్వరాశిలోనున్న జాతకుడు చేయుకార్యముల వలన రాజులు అతనిని అసమర్ధునిగా భావించును. రాజు ఎదుట తన అసమర్థ కార్యముల వలన దీనత్వమును ప్రకటించును.

**దశమభావగత కుజ ఫలము :-**

**యుద్ధాఖ్యాం దూతజం నీచం పరదార్యాధిపం తతః**
**గణితోత్థం పారదార్యాద్ గణిత ప్రభవం తతః 7**
**అక్షిజం భారతే ప్రీతి విహీనం దైన్య సమ్భవమ్**
**భిక్షాజం అష్టకోష్టోత్థం కర్మస్థితే కుజే 8**

1. కుజుడు దశమభావములో ఉచ్చరాశిలోనున్న జాతకుడు యుద్ధకార్యమును నిర్వర్తించును.
2. ఉచ్చనవాంశలో నున్న సేవకకార్యములను చేయును.
3. శుభ షడ్వర్గులోనున్న జాతకుడు నీచకార్యములను చేయును.
4. నీచరాశిలోనున్న ఇతరుని పత్నికి భర్తగానుండును.
5. నీచనవాంశలోనున్న గణిత సంబంధ కార్యమును చేయును.

6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు పరస్త్రీల కొరకు కార్యము చేయును.
7. మిత్రరాశిలోనున్న గణిత సంబంధ కార్యమును చేయును.
8. మిత్ర నవాంశలోనున్న దృష్టి సంబంధకార్యము (కాపలాదారు) వలన జీవించును.
9. వర్గోత్తమ నవాంశలోనున్న దేశద్రోహకార్యమును చేయును.
10. శత్రురాశిలో నున్న దీనమైన కార్యమును చేయును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు భిక్షాటనము చేయును.
12. స్వరాశిలో నున్న జాతకుడు అష్టకర్మలను (ఆదాన, విసర్గ, ప్రైష, నిషేధ, అర్థవచన, వ్యవహారేక్షణ, దండ, శుద్ధి) చేయువాడగును.

**దశమభావస్థిత బుధ ఫలము :-**

**ధనధాన్య సముద్భూతం చతుష్పాద సముద్భవమ్**
**శుభంవాజి క్రియాద్యూతం పరదేశ సముద్భవమ్** 9
**ఖలజిం ఖరజం తజ్ఞం హోమమన్త్ర పరాత్మకమ్**
**కష్టజం నిర్గుణం కీర్తిప్రదం కర్మఖగే బుధే** 10

1. బుధుడు దశమభావములో ఉచ్చరాశిలో నున్న జాతకుడు ధనధాన్య సంబంధకార్యములు చేసి జీవించును.
2. ఉచ్చనవాంశలో నున్న పశుపాలనము వాహనసంచాలనము వలన జీవించును.
3. శుభ షడ్వర్గులోనున్న శుభకర్మలు చేయును.
4. నీచరాశిలోనున్న గుర్రములను పాలించుట వలన జీవించును.
5. నీచనవాంశలోనున్న జాతకుడు ద్యూతము వలనజీవించును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు చాలా దూరముగా వెళ్ళి జీవించును.
7. మిత్రరాశిలోనున్న దుష్టవ్యక్తుల సహయోగముతో జీవించును.
8. మిత్ర నవాంశలోనున్న గాడిదలనుపయోగించి జీవించును.
9. వర్గోత్తమములోనున్న హోమ - హవన మంత్రాదులతో జీవించును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు అధిక కష్టము చేసి జీవించును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు గుణహీనుడగును.
12. స్వరాశిలో నున్న జాతకుడుగౌరవప్రదమైన కార్యములు చేసి జీవించును.

**దశమభావస్థిత గురు ఫలము :-**

**బహుదానం ద్విజార్చాఖ్యం ద్విజదేవార్చనా దికమ్**
**హీనసేవాత్మకం చౌర్యం ధనహీనం శుభాత్మకమ్** 11
**భూపజం గోమహిష్యుత్థం కృతఘ్నం పరవఞ్చకమ్**
**రాజక్రియం గురౌకర్మ క్రియతే కర్మభావగే** 12

1. గురుడు దశమభావములో ఉచ్చరాశిలో నున్న జాతకుడు అధికదానము చేయుట వలన కీర్తిని పొందును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు బ్రాహ్మణులను సంతులను పూజించును.
3. శుభ షడ్వర్గులోనున్న దేవాదిపూజ చేయువాడగును.
4. నీచరాశిలోనున్న జాతకుడు నీచవ్యక్తిని సేవించును.
5. నీచనవాంశలోనున్న దొంగతనము చేయును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు ధనహీనుడగును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు శుభకర్మలు చేయును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు రాజసంబంధమైన కార్యములను చేయును.
9. వర్గోత్తమములోనున్న గేదెలకు సంబంధించిన కార్యమును చేసి జీవించును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు కృతఘ్నుడగును.
11. శత్రు నవాంశలోనున్న ఇతరులను మోసముచేసి జీవించును.
12. స్వరాశిలో నున్న జాతకుడు రాజకార్యములు చేసి అందరికి ప్రియుడగును.

**దశమభావగత శుక్ర ఫలము :–**

**జనేష్టం మణిముకురోత్థం హేమజం స్త్రీ జనాశ్రితమ్**
**అన్యసౌఖ్యం కష్టయుతం ప్రభూతార్థం స్వబన్ధుజమ్ 13**
**గోధనాశ్వాన్వితం హింస్రం చిన్తాఢ్యం వాజిసమ్భవమ్**
**కర్మభావగతే శుక్రే క్రియతే కర్మ జన్తునా 14**

1. శుక్రుడు దశమభావములో ఉచ్చరాశిలో నున్న జాతకుడు జనులందరికి ఇష్టుడగును. జనహితమైన కార్యములు చేసి జీవించును.
2. ఉచ్చనవాంశలో నున్న మణులు మకుటాదులకు (దర్పణాదులు) సంబంధించిన కార్యములు చేసి జీవించును.
3. శుభ షడ్వర్గులోనున్న జాతకుడు స్వర్ణధాతు సంబంధిత కార్యములను చేసి జీవించును
4. నీచరాశిలోనున్న స్త్రీలసహయోగము వలన జీవించును.
5. నీచనవాంశలోనున్న ఇతరులు సుఖముగా నుండు కార్యములను చేయును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు కష్టతరమైన కార్యములు చేసి జీవనము చేయును.
7. మిత్రరాశిలోనున్న బంధువుల సహయోగమును పొంది జీవనము చేయును.
8. మిత్ర నవాంశలోనున్న స్వజనుల సహయోగమును పొంది జీవనము సాగించును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు పశువాహన సంబంధ కార్యములు చేసి జీవించును.

10. శత్రురాశిలో నున్న జాతకుడు ఇతరులను హింసించి జీవితమును సాగించును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు తాను చేయు కర్మల వలన వ్యాకులముతో నుండును.
12. స్వరాశిలో నున్న జాతకుడు గుర్రములకు సంబంధించిన పనులు చేసి జీవితమును సాగించును.

**దశమభావగత శని ఫలము :-**

**మార్దవస్థైర్య జనితం శిల్పస్థం ప్రియ సాధ్వసమ్**
**ద్విజగేహభవం చాన్య సేవారూపం నృశంసకమ్ 15**
**ప్రభూతహీబ దర్మఇ్చ సేవాఢ్యం మృగయాభిధమ్**
**పైశున్యసంజ్ఞం భైషజ్యం కర్మకర్మగతేశనౌ 16**

1. శని దశమభావములో స్వోచ్చరాశిలో నున్న జాతకుడు మృదువైన స్థైర్య (స్థిరమైన మనస్తత్వముతో చేయు) కార్యములను చేసి జీవనము సాగించును.
2. ఉచ్ఛనవాంశలో నున్న జాతకుడు శిల్పకళకు సంబంధించిన కార్యములు చేసి జీవనము సాగించును.
3. శుభ షడ్వర్గులోనున్న జాతకుడు ప్రమాదకరమైన కార్యములు చేసి జీవనము సాగించును.
4. నీచరాశిలోనున్న బ్రాహ్మణుల గృహములో పనిచేసి జీవించును.
5. నీచనవాంశలోనున్న ఇతరులకు సేవచేసి జీవించును.
6. పాప షడ్వర్గులోనున్న జాతకుడు నృశంస కర్మలను చేయును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు సామాన్యమైన హీనమైన కార్యములను చేసి జీవించును.
8. మిత్ర నవాంశలోనున్న ధర్మకార్యములు చేసి జీవించును.
9. వర్గోత్తమములోనున్న ఇతరులకు సేవ చేసి జీవించును.
10. శత్రురాశిలో నున్న జాతకుడు జంతువులను పాలించుట వలన జీవించును.
11. శత్రు నవాంశలోనున్న జాతకుడు చాడీలు చెప్పువాడగును.
12. స్వరాశిలోనున్న జాతకుడు ఔషధములకు సంబంధించిన కార్యములను చేసి జీవనమును సాగించును.

## అష్టమభావగత ద్వాదశగ్రహఫలము

| గ్రహముల ద్వాదశ స్థితి | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| స్వోచ్ఛ | ధార్మిక కర్మ | ప్రసిద్ధ కర్మ | యుద్ధాది | ధన ధాన్యకర్మ | బహు దాన | లోక ప్రియ | మృదు కర్మ |
| సోచ్ఛ నవాంశ | వధ బం ధనము | ద్విజ దేవ | దూత | చతు ష్పాద | ద్విజార్య | మణి ముకుట | శిల్ప |
| శుభవర్గు | కలంకిత | శుభ | నీచ | శుభ | దేవా ర్చన | స్వర్ణ | భయ యుక్త |
| నీచ రాశి | బహు దాన | లజ్జా యుక్త | పర దార | అశ్వ కర్మ | హీన సేవ | స్త్రీజనా శ్రిత | ద్విజ |
| నీచ నవాంశ | కుభూప సేవ | క్రయ విక్రయ | గణిత | ద్యూత | చౌర్య | అన్య సౌఖ్య | సేవ |
| పాపవర్గు | వధ బంధ | వ్యసన కర్మ | పరస్త్రీ | ప్రవాస | ధన హీన | కష్ట యుక్త | నృశంస |
| మిత్రరాశి | హింస | శుభ | గణిత | దుష్ట | శుభ | పాప | ప్రభూత |
| మిత్ర నవాంశ | వాణిజ్య | శాస్త్ర జన్య | అక్షజ | ఖరజ | రాజ | స్వబంధు | హీన |
| వర్గోత్తమం | వాణిజ్య | చిత్రకార | దేశప్రేమ | జప హెూమ | పశు | గోధన | సేవాఢ్య |
| శత్రురాశి | అశుభ | హింస | దైన్య | కష్టజ | కృతఘ్న | హింస | మృగయ |
| శత్రు నవాంశ | గర్హిత | స్త్రీజన్య | భిక్షాటన | నిర్గుణ | పర వంచక | చింతాఢ్య | పిశున్యము (చాడీలు) |
| స్వరాశి | అన్యసేవ | నృపతి దైన్య | అష్ట కష్ట | కీర్తి ప్రద | రాజ ప్రియ | అశ్వ కర్మ | ఔషధ కర్మ |

**కశ్యపజాతకములో ఏకాదశాధ్యాయము సమాప్తము**

# 13. త్రయోదశాధ్యాయము

## ఏకాదశ భావఫలాధ్యాయము

**ఏకాదశ భావగ్రహ ద్వాదశ స్థితి :-**

**స్వోచ్చే స్వోచ్చ నవాంశే చ శుభవర్గేఽ థ నీచభే**
**నీచాంశే క్రూరషడ్వర్గే మిత్రగే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽ రి భేర్యంశే స్వర్క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలఞ్చ లాభ భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

చ్యవన మతానుసారము ఏకాదశభావములో 1.స్వోచ్చ 2.స్వోచ్చాంశ 3.శుభవర్గ 4.నీచ 5.నీచనవాంశ 6.పాపవర్గ 7.మిత్రరాశి 8.మిత్రనవాంశ 9.వర్గోత్తమము 10.శత్రురాశి 11.శత్రునవాంశ 12.స్వరాశులలో గ్రహఫలితములు తెలుపబడుతున్నవి.

**ఏకాదశభావగత రవి ఫలము :-**

**రాజాశ్వోష్టలతా పాద్యై: శునకోత్థక పర్ధిత:**
**కృధాన్యస్య పరస్త్రీణాం సుహృదా కులయోషితామ్ 3**
**ఆర్యాణాం ఖల సంయుక్త: కమ్బలానాం తత: పరమ్**
**ఖలానాం గుణానాం సూర్యే లాభ: స్యాల్లాభభావగే 4**

1. రవి ఏకాదశభావములో స్వోచ్చలోనున్న జాతకుడు గజాశ్వాదులు వాహనాదుల వలన లాభము పొందును.
2. ఉచ్చనవాంశలోనున్న కుక్కలకు సహాయము చేయుట వలన లాభము కలుగును.
3. శుభషడ్వర్గులో నున్న భగవానుడైన శంకురుని దయ వలన లాభము కలుగును.
4. నీచరాశిలోనున్న కృధాన్యముల వలన లాభము కలుగును.
5. నీచ నవాంశలోనున్న పరస్త్రీల వలన లాభము కలుగును.
6. పాపషడ్వర్గులో నున్న మిత్రుల వలన లాభము కలుగును.
7. మిత్రరాశిలోనున్న తన కులములోని స్త్రీలవలన లాభము కలుగును.
8. మిత్ర నవాంశలోనున్న శ్రేష్ఠజనుల వలన లాభము కలుగును.
9. వర్గోత్తమములోనున్న దుష్టుల వలన లాభము కలుగును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు కంబలముల వలన లాభము కలుగును.
11. శత్రునవాంశలోనున్న దుష్ట జనుల వలన లాభము కలుగును.
12. స్వరాశిలోనున్న జాతకుడు తనగుణముల వలన లాభమును పొందును.

**ఏకాదశభావగత చంద్ర ఫలము :-**

**ముక్తామణీనాం సద్ద్రవ్యం సదన్నస్య చ సన్నృణామ్**

**కుభార్యాయాం కుభృత్యానాం బహువైరి విధాయినామ్** 5
**వృక్షాణాం భవనే లాభం చాన్ద్ర: స్యాల్లాభ భావగే**
**చతుష్టదానాం ఖాద్యానాం తణ్డులానాం తత:పరమ్** 6

1. చంద్రుడు ఏకాదశభావములో స్వోచ్చలోనున్న జాతకుడు మణిముత్య భూషణముల వ్యాపారము వలన లాభము పొందును.
2. ఉచ్చనవాంశలోనున్న శ్రేష్ఠద్రవ్యముల వలన లాభము కలుగును.
3. శుభషడ్వర్గులో నున్న శ్రేష్ఠమైన అన్న పదార్థముల వలన లాభము కలుగును.
4. నీచరాశిలోనున్న శ్రేష్ఠులైన మనుష్యుల వలన లాభము కలుగును.
5. నీచ నవాంశలోనున్న దుష్టపత్ని వలన లాభము కలుగును.
6. పాపషడ్వర్గులో నున్న జాతకునికి దుష్టసేవకుడు లభించును.
7. మిత్రరాశిలోనున్న జాతకునికి అధిక శత్రువులుండును. వాని వలన లాభము కలుగును.
8. మిత్ర నవాంశలోనున్న వృక్షముల వలన లాభము కలుగును.
9. వర్గోత్తమములోనున్న భవనాదుల వలన లాభము కలుగును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు జంతువుల వలన లాభము పొందును.
11. శత్రునవాంశలోనున్న ఖాద్య పదార్థముల వలన లాభము కలుగును.
12. స్వరాశిలోనున్న జాతకుడు బియ్యము వలన లాభమును పొందును.

**ఏకాదశభావగత కుజ ఫలము :-**

**స్తేయస్య వఞ్చనాధ్యానాత్ నృపలోకాత్ మహాజనాత్**
**మహాజన మహీపాలాత్ లోకాభ్యాం వఞ్చకస్య చ** 7
**పరతర్కస్య సత్వస్య భూషణానాఙ్గ కుజే భవేత్**
**ఏకాదశేస్థితేతస్య లాభాం బ్రూయాత్ విచక్షణ:** 8

1. కుజుడు ఏకాదశభావములో స్వోచ్చలోనున్న జాతకుడు దొంగతనము చేయుట వలన లాభము పొందును.
2. ఉచ్చనవాంశలోనున్న మోసము చేయుట వలన లాభము కలుగును.
3. శుభషడ్వర్గులో నున్న ఉన్నతాధికారుల వలన లాభము పొందును.
4. నీచరాశిలోనున్న రాజ కోశాగారము వలన లాభము కలుగును.
5. నీచ నవాంశలోనున్న గౌరవనీయమైన వ్యక్తుల వలన లాభము కలుగును.
6. పాపషడ్వర్గులో నున్న అనేకమంది జనుల వలన లాభము కలుగును.
7. మిత్రరాశిలోనున్న రాజు వలన ధనలాభమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న అనేకమంది ప్రజల వలన లాభము కలుగును.

9. వర్గోత్తమములోనున్న ఇతరులను మోసము చేసి లాభమును పొందును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు ఇతరుల గురించి ఆలోచన చేయుట వలన లాభమును పొందును.
11. శత్రునవాంశలోనున్న నితరులపై బలప్రయోగము చేయుట వలన ధనమును పొందును.
12. స్వరాశిలోనున్న జాతకుడు భూషణముల వలన లాభమును పొందును.

**ఏకాదశభావస్థత బుధ ఫలము :-**

**శాస్త్రజ్ఞో వివిధోపాయ: సర్వవిద్యా సముద్భవ:**
**నీచసఙ్గాద్ ధూర్త సఙ్గాదన్త్యజాత్ మిత్రసఙ్గత: 9**
**వివ్యయాత్ సువ్యవహృతే: కూపాచారేణ దమ్భత:**
**క్రయవిక్రయతో లాభో బుధే స్యాల్లాభ భావగే 10**

1. బుధుడు ఏకాదశభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు శాస్త్రజ్ఞుడగుట వలన లాభము పొందును.
2. ఉచ్చనవాంశలోనున్న అనేక విధములైన ఉపాయములతో ధన లాభము పొందును.
3. శుభషడ్వర్గులో నున్న జాతకుడు సర్వ విద్యలు నేర్చుట వలన లాభము పొందును.
4. నీచరాశిలోనున్న నీచవ్యక్తుల సహవాసముతో లాభము కలుగును.
5. నీచ నవాంశలోనున్న దుష్టజనుల సహవాసముతో లాభము కలుగును.
6. పాపషడ్వర్గులో నున్న అంత్యజుల వలన లాభము పొందును.
7. మిత్రరాశిలోనున్న జాతకుడు మిత్రుల వలన లాభమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న అధిక వ్యయము చేయుట వలన లాభము కలుగును.
9. వర్గోత్తమములోనున్న వ్యవహార కుశలత వలన లాభమును పొందును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు కూపాదులు నిర్మించుట వలన లాభమును పొందును.
11. శత్రునవాంశలోనున్న ఆడంబరములు ప్రదర్శించుట వలన లాభమును పొందును.
12. స్వరాశిలోనున్నజాతకుడు క్రయవిక్రయ కార్యములు చేయుట వలన లాభమును పొందును.

**ఏకాదశభావగత గురు ఫలము :-**

**రాజతోరాజ భృత్యాచ్చ ప్రభావాత్ స్వజనస్య చ**
**అనృతోఽ ధర్మత: కష్టాత్ దూతతోత్థశ్చ ధాతుజ: 11**
**సుజనోత్థమధర్మస్యాబ్ధిజస్య విగుణస్య చ**
**ఆయుధానాం గురౌలాభౌ లాభభావగతేక్రమాత్ 12**

1. గురుడు ఏకాదశభావములో స్వోచ్చలోనున్న జాతకుడు రాజులవలన లాభము

పొందును.

2. ఉచ్చనవాంశలోనున్న రాజ సేవకుల వలన లాభము కలుగును.
3. శుభషడ్వర్గులో నున్న తన గొప్పతనము వలన లాభము పొందును.
4. నీచరాశిలోనున్న తనవారి వలన లాభము కలుగును.
5. నీచ నవాంశలోనున్న అసత్య వ్యవహారము చేయుట వలన లాభము పొందును.
6. పాపషడ్వర్గులో నున్న అధర్మ ప్రవర్తన వలన కష్టపూర్వకముగా లాభము పొందును.
7. మిత్రరాశిలోనున్న సేవక వృత్తి చేయుట వలన లాభమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న ధాతువులకు సంబంధించిన కార్యములు చేయుట వలన లాభము కలుగును.
9. వర్గోత్తమ నవాంశములోనున్న సుజనుల వలన లాభమును పొందును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు అధర్మకార్యములు చేయుట వలన లాభమును పొందును.
11. శత్రునవాంశలోనున్న సముద్రీ పదార్థముల వలన లాభము కలుగును.
12. స్వరాశిలోనున్న ఆయుధముల ప్రయోగము వలన లాభమును పొందును.

**ఏకాదశభావగత శుక్ర ఫలము :-**

**సుతబన్ధు భవో రాజకన్యోత్థ: తద్ద్వయోద్భవ:**
**పాపానాం హీనబుద్ధీనాం ద్విజనిన్ద్య వ్రతస్య చ** **13**
**వాహనస్య చ కాన్తాయా: ప్రియస్య హతబన్ధుజ:**
**గతప్రేమ్ణాం సుఖవతాం లాభో లాభగతేసితే** **14**

1. శుక్రుడు ఏకాదశభావములో స్వోచ్చలోనున్న జాతకుడు తనసుతులు బంధువుల వలన లాభము పొందును.
2. ఉచ్చనవాంశలోనున్న రాజ కన్యల వలన లాభము పొందును.
3. శుభషడ్వర్గులో నున్న బంధువులు రాజకన్యల వలన లాభము పొందును.
4. నీచరాశిలోనున్న జాతకుడు పాపుల వలన లాభము కలుగును.
5. నీచ నవాంశలోనున్న మూర్ఖుల వలన లాభము పొందును.
6. పాపషడ్వర్గులో నున్న బ్రాహ్మణ సాధువుల వలన లాభము పొందును.
7. మిత్రరాశిలోనున్న వాహనముల వలన లాభమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న స్త్రీల వలన లాభము పొందును.
9. వర్గోత్తమములోనున్న ప్రియవ్యక్తి సహాయము వలన లాభమును పొందును.

10. శత్రురాశిలోనున్న తన శత్రువులు మరణించుట వలన లాభమును పొందును.

11. శత్రునవాంశలోనున్న సమాజము బంధువులు తిరస్కరించిన వ్యక్తి వలన లాభము కలుగును.

12. స్వరాశిలోనున్న జాతకుడు సుఖముగా జీవించు వారి వలన లాభమును పొందును.

**ఏకాదశభావగత శని ఫలము :-**

**సున్నృణాం ధన ధాన్యస్య పూజితస్య నరాస్తథా**
**గర్వితానామ బుద్ధీనాం మిత్రజోన్నతి సమ్భవ: 15**
**శుభక్రియత్థో శత్రూత్థ: కృతఘ్నాత్స్థిర కర్మజ:**
**శనౌ లాభగతే లాభో జన్మలగ్నాన్నృణాం భవేత్ 16**

1. శని ఏకాదశభావములో స్వోచ్చలోనున్న జాతకునికి జనుల పరిచయము వలన ద్రవ్యాది లాభము కలుగును.
2. ఉచ్చనవాంశలోనున్న ధనధాన్యము వలన లాభము కలుగును.
3. శుభషడ్వర్గులో నున్న జాతకుడు పూజనీయ వ్యక్తుల వలన లాభమును పొందును.
4. నీచరాశిలోనున్న నిందనీయ వ్యక్తుల వలన లాభము కలుగును.
5. నీచ నవాంశలోనున్న ధనము అన్నముల లాభము కలుగును.
6. పాపషడ్వర్గులో నున్న బుద్ధిహీన వ్యక్తుల వలన లాభము కలుగును.
7. మిత్రరాశిలోనున్న మిత్రుల వలన లాభమును పొందును.
8. మిత్ర నవాంశలోనున్న ఉన్నతస్థితి జాతకునికి లాభమును కలిగించును.
9. వర్గోత్తమ నవాంశములోనున్న సుభకర్మ చేయుట వలన లాభమును కలుగును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు శత్రువుల వలన లాభమును పొందును.
11. శత్రునవాంశలోనున్న కృతఘ్నుల వలన లాభము పొందును.
12. స్వరాశిలోనున్న స్థిరమైన కార్యములు చేయుట వలన లాభమును పొందును.

**విశేషము :-** ఏకాదశభావములో లాభప్రాప్తి గురించి తెలుపబడును. లాభస్థానములో అన్ని గ్రహములు ప్రశస్తమైనవిగా తెలుపబడినవి. ఏదైన గ్రహము లాభభావములో లేక లాభ నవాంశలోనున్న తన దశాంతర్దశలలో జాతకునికి ఆగ్రహమునకు సంబంధించిన వస్తువుల లాభము కలుగును. శుభగ్రహస్థితిలోనున్న శుభమార్గము వలన శుభవస్తు లాభము కలుగును. లేనియెడల అశుభమార్గములో లాభము కలుగును. అందువలన **"లాభే సర్వేగ్రహాల ప్రశస్తా:"** అని తెలుపబడెను.

## ఏకాదశ భావగత గ్రహ ఫలచక్రము (లాభము)

| గ్రహముల ద్వాదశ స్థితి | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| స్వోచ్ఛ | వాహనము వలన | మణి మౌక్తికము | చౌర్యము | శాస్త్రము | రాజు | పుత్రాదులు | సుగుణులు |
| సోచ్ఛ నవాంశ | కుక్కలు | సద్రవ్యము | వంచన | వివిధము | రాజ భృత్యులు | రాజ కన్య | ధన ధాన్యము |
| శుభవర్గు | శివ కృప | సద న్నము | రాజ ధనము | సర్వ విద్యలు | ప్రభా వము | పుత్రులు రాజకన్య | పూజ |
| నీచ రాశి | దూషి తాన్నము | సద్వ్యక్తి | మహా జనులు | నీచ సంగము | స్వజను లు | పాపులు | నీచ మను ష్యులు |
| నీచ నవాంశ | స్త్రీలు | కుభార్య | మహా జనులు | ధూర్త సంగము | అబ ద్ధము | హీన బుద్ధి | గర్విత జనులు |
| పాపవర్గు | మిత్రులు | కుభృత్యు లు | రాజ ధనము | అంత్య జులు | కష్టము | ద్విజ నింద | బుద్ధి హీనులు |
| మిత్రరాశి | కుల స్త్రీలు | వైరులు | రాజ ధనము | మిత్ర సంగము | దూత | వాహనము | మిత్రులు |
| మిత్ర నవాంశ | శ్రేష్ఠ జనులు | వృక్షా దులు | ప్రజలు | విశేష వ్యయము | ధన జన్యము | పత్ని | ఉన్నతి |
| వర్గోత్తమం | దుష్టులు | భవనము | మోసము | సవ్యవ హారము | సజ్జ నులు | ప్రియ జనము | శుభ క్రియ |
| శత్రురాశి | కంబలి | చతుష్ప దము | పర తర్కము | కూపా చారము | అధర్మము | హత బంధువు | శత్రువులు |
| శత్రు నవాంశ | దుష్టులు | ఖాద్య పదార్థాలు | బలము | దంభము | అవ గుణము | గత సౌహా ర్ద్రము | కృత ఘ్నుత |
| స్వరాశి | గుణవం తులు | బియ్యము | భూష ణములు | క్రయ వి క్రయము | ఆయు ధము | సుఖ జనులు | స్థిర కర్మ |

**కశ్యపజాతకములో త్రయోదశాధ్యాయము సమాప్తము**

# 14. చతుర్దశాధ్యాయము

## వ్యయభావ ఫలాధ్యాయము

**ద్వాదశభావ గ్రహ ద్వాదశస్థితి :-**

**స్వోచ్చే స్వోచ్చ నవాంశే చ శుభవర్గేఽథ నీచభే**
**నీచాంశే క్రూరషడ్వర్గే మిత్రగే సుహృదంశకే 1**
**వర్గోత్తమేఽరి భేర్యంశే స్వర్క్షే ద్వాదశధాక్రమాత్**
**ఫలఇచ్ఛ లాభ భావోత్థం కథ్యతే చ్యవనోదితమ్ 2**

చ్యవన మతానుసారము వ్యయభావములో 1. స్వోచ్ఛ 2.స్వనవాంశ 3. శుభవర్గ 4.నీచ 5.నీచనవాంశ 6.పాపవర్గ 7.మిత్రరాశి 8.మిత్రనవాంశ 9.వర్గోత్తమము 10. శత్రురాశి 11.శత్రునవాంశ 12. స్వరాశులలో గ్రహఫలితములు తెలుపబడుతున్నవి.

**ద్వాదశభావగత రవి ఫలము :-**

**వ్యయం స్యాద్గురులోకేషు గురుసేవా సముద్భవ:**
**ద్విజదైవకార్యేషు కుజనాత్ కుకలత్రత: 3**
**అన్త్యజార్థే మిత్రకార్యే అనురోధాత్ నృపాశ్రయాత్**
**వైశ్యాసు కులటాస్నేహాద్ భయతోఽర్కే వ్యయస్థితే 4**

1. రవి ఉచ్చరాశిలో ద్వాదశభావములోనున్న జాతకుడు గురు జనుల కొరకు వ్యయము చేయును.
2. ఉచ్చనవాంశలో నున్న గురు జనుల సేవకొరకు ధనవ్యయము చేయును.
3. శుభషడ్వర్గులో నున్న బ్రాహ్మణులకు దేవకార్యములకు వ్యయము చేయును.
4. నీచరాశిలోనున్న జాతకుడు నీచ ప్రజల కొరకు వ్యయము చేయును.
5. నీచ నవాంశలోనున్న చెడు స్వభావముగల భార్యకొరకు ధనవ్యయము చేయును.
6. పాపషడ్వర్గులో నున్న అంత్యజుల కొరకు వ్యయము చేయును.
7. మిత్రరాశిలోనున్న మిత్రుల కొరకువ్యయము చేయును.
8. మిత్ర నవాంశలోనున్న ఇతరులు కోరినవారి కొరకు వ్యయము చేయును.
9. వర్గోత్తమములోనున్న రాజును ఆశ్రయించుట వలనవ్యయము చేయును.
10. శత్రురాశిలోనున్న వైశ్యుల కొరకు ధన వ్యయము చేయును.
11. శత్రునవాంశలోనున్న కులటతో స్నేహము చేయుట వలన ధనవ్యయమగును.
12. స్వరాశిలోనున్న జాతకుడు భయమును పోగొట్టుకొనుటకు వ్యయము చేయును.

**ద్వాదశభావగత చంద్ర ఫలము :-**

**ద్యూతాత్ కృష్య క్రియాద్యేన ద్విజసేవా సముద్భవ:**
**పరస్త్రీ సజ్గజారోஉన్యలోక సజ్గాచ్ఛ పాపత: 5**
**సుహృద్భవోబన్ధుమానాచ్ఛుభకార్యేణ యుధ్యత:**
**పరవఞ్చనతో వృద్ధ కృత్యేన్దౌ వ్యయస్థితే 6**

1. చంద్రుడు స్వోచ్చరాశిలో ద్వాదశభావములోనున్న జాతకుడు జ్యూదమాడుట వలన ధనవ్యయము చేయును.
2. ఉచ్చనవాంశలో నున్న కృషికార్యము (పశుపాలనాదులు)లందు ధనవ్యయము చేయును.
3. శుభషడ్వర్గులో నున్న ద్విజుల సేవ చేయుటకు ధన వ్యయము చేయును.
4. నీచరాశిలోనున్న తాను దాచిన ధనము పరస్త్రీలతో కూడి వ్యయము చేయును.
5. నీచ నవాంశలోనున్న ఇతరుల కొరకు ధనవ్యయము చేయును.
6. పాపషడ్వర్గులో నున్న పాపకార్యములకు ధన వ్యయము చేయును.
7. మిత్రరాశిలోనున్న తన అవసరములను పూర్తిచేసుకొనుటకు ధనవ్యయము చేయును.
8. మిత్ర నవాంశలోనున్న జాతకుడు తనబంధువు కొరకు ధన వ్యయము చేయును.
9. వర్గోత్తమములోనున్న జాతకుడు శుభకార్యములకు వ్యయము చేయును.
10. శత్రురాశిలోనున్న యుద్ధాది కార్యములకు ధన వ్యయము చేయును.
11. శత్రునవాంశలోనున్న జాతకుడు ఇతరులను వంచించుటకు ధనవ్యయము చేయును.
12. స్వరాశిలోనున్న జాతకుడు వృద్ధావస్థలో చేయు ధర్మకార్యములకు ధన వ్యయము చేయును.

**ద్వాదశభావస్థ కుజ ఫలము :-**

**నృపసజ్గాన్నీచమైత్ర సజ్గాద్ బాంధవ దోషత:**
**అన్త్యజాద్ వ్యసనై: నీచ సజ్గాద్నృపసమ్భవ: 7**
**పిత్రుక్రియాభి: సౌహార్ద్రా నిరోధేన చతుష్టదై:**
**బన్ధువర్గైరాదిత: స్యాద్ వ్యయో భౌమే వ్యయస్థితే 8**

1. కుజుడు ద్వాదశభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు రాజుతో కూడియుండుట వలన ధన వ్యయము చేయును.
2. ఉచ్చనవాంశలో నున్న జాతకుడు దుష్టస్వభావముగల వారితో స్నేహము చేసి వారికొరకు ధనవ్యయము చేయును.

3. శుభషడ్వర్గులో నున్న బంధువులకు దోషపూరితమైన కార్యములకు వ్యయము చేయును.
4. నీచరాశిలోనున్న జాతకుడు అంత్యజుల కొరకు వ్యయము చేయును.
5. నీచ నవాంశలోనున్న చెడు వ్యసనముల వలన ధనవ్యయము చేయును.
6. పాపషడ్వర్గులో నున్న దుష్టులతో కూడుట వలన ధన వ్యయము చేయును.
7. మిత్రరాశిలోనున్న గొప్పతనము చెప్పుకొనుటకు ధనవ్యయము చేయును.
8. మిత్ర నవాంశలోనున్న పిత్రుకార్యములకు ధన వ్యయము చేయును.
9. వర్గోత్తమములోనున్న మిత్రులకొరకు ధనవ్యయము చేయును.
10. శత్రురాశిలోనున్న తానుచేయు దోషములను నిరోధించుటకు (ఆపుటకు) వ్యయము చేయును.
11. శత్రునవాంశలోనున్న పశుపాలనమునకు ధనవ్యయము చేయును.
12. స్వరాశిలోనున్న జాతకుడు బంధువుల కొరకు ధన వ్యయము చేయును.

**ద్వాదశభావగత బుధ ఫలము :-**

**గీతవాద్యై: గుణికృత: ప్రసఙ్గైరపి నిగ్రహాత్**
**నీచసఙ్గాన్నీచలోకే తృప్తిలోకే సఖాశ్రయాత్** 9
**వాన్ధవేషు వ్రతాద్యేషు సుతజోఽ న్యవధూభవ:**
**భోగజ:స్యాద్బుధే రిష్ఫే భావస్థే వ్యయగే నృణామ్** 10

1. బుధుడు ద్వాదశభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు గీతవాద్యాది మనోరంజనము కొరకు ధన వ్యయము చేయును.
2. ఉచ్చనవాంశలో నున్న గుణవంతుల కొరకు ధనవ్యయము చేయును.
3. శుభషడ్వర్గులో నున్న అవసరమైనపుడు మాత్రమే వ్యయము చేయును.
4. నీచరాశిలోనున్న చెడుకార్యముల కొరకు వ్యయము చేయును.
5. నీచ నవాంశలోనున్న నీచుల సహవాసము వలన ధనవ్యయము చేయును.
6. పాపషడ్వర్గులో నున్న తృప్తికలిగిన వారి (సంపన్నుల)కొరకు ధన వ్యయము చేయును.
7. మిత్రరాశిలోనున్న మిత్రుల కొరకు ధనవ్యయము చేయును.
8. మిత్ర నవాంశలోనున్న బంధువుల కొరకు ధన వ్యయము చేయును.
9. వర్గోత్తమములోనున్న వ్రతాదులకు ధనవ్యయము చేయును.
10. శత్రురాశిలోనున్న పుత్రుల కొరకు ధనవ్యయము చేయును.
11. శత్రునవాంశలోనున్న ఇతరుల కొరకు ధనవ్యయము చేయును.
12. స్వరాశిలోనున్న జాతకుడు భోగవిలాసముల కొరకు ధన వ్యయము చేయును.

**ద్వాదశభావగత గురు ఫలము :-**

**గురుభ్యో గురుభృత్యేభ్యో బన్ధుభ్యోవ్యసనేన చ**
**మతిభ్రమణ పుత్రేభ్యో: మిత్రేభ్యో వాసుహృజ్జనై: 11**
**లక్ష్యార్థే ప్రతిపక్షే చ వివాదే చ వితణ్డకే**
**స్వజనేభ్యశ్చ దానేన వ్యయ:స్యాద్ వ్యయనే గురౌ 12**

1. గురుడు ద్వాదశభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు గురుజనులు గౌరవనీయ వ్యక్తుల కొరకు ధన వ్యయము చేయును.
2. ఉచ్చనవాంశలో నున్న గురువులను సేవించుట కొరకు ధనవ్యయము చేయును.
3. శుభషడ్వర్గులో నున్న బంధువుల కొరకు వ్యయము చేయును.
4. నీచరాశిలోనున్న వ్యసనముల కొరకు వ్యయము చేయును.
5. నీచ నవాంశలోనున్న బుద్ధిభ్రమించుట వలన ధనవ్యయము చేయును.
6. పాపషడ్వర్గులో నున్న పుత్రుల కొరకు ధన వ్యయము చేయును.
7. మిత్రరాశిలోనున్న మిత్రుల కొరకు ధనవ్యయము చేయును.
8. మిత్ర నవాంశలోనున్న ప్రియజనుల కొరకు ధన వ్యయము చేయును.
9. వర్గోత్తమములోనున్న మంచి కార్యముల కొరకు తనవద్ద నున్న ధనమును వ్యయము చేయును.
10. శత్రురాశిలోనున్న ప్రతిపక్షము వారి కొరకు ధనవ్యయము చేయును.
11. శత్రునవాంశలోనున్న వితండవాదము చేయుటవలన ధన వ్యయమగును.
12. స్వరాశిలోనున్న జాతకుడు తనవారి కొరకు ధనవ్యయము చేయును.

**ద్వాదశభావగత శుక్రఫలము :-**

**వ్రతజ: శాస్త్రజనిత: ప్రియసఙ్గాత్ నృపాశ్రయాత్**
**వ్యయసాయాద్ శుభ తో బహుభక్షణ సంయుత: 13**
**పానాథ్ భూమేఽ రుణాచ్చైవ భాజన విప్లావనేన చ**
**వితథౌ చౌపచారైశ్చ వ్యయ: స్యాద్ వ్యయగే సితే 14**

1. శుక్రుడు ద్వాదశభావములో స్వోచ్చరాశిలోనున్న జాతకుడు వ్రతాదులు చేయుటకు ధన వ్యయము చేయును.
2. ఉచ్చనవాంశలో నున్న శాస్త్రాధ్యయమునకు వ్యయము చేయును.
3. శుభషడ్వర్గులో నున్న ప్రియ వ్యక్తుల కొరకు వ్యయము చేయును.
4. నీచరాశిలోనున్న రాజాశ్రయము పొందుట వలన ధనవ్యయము చేయును. ఉన్నతాధికారులకు స్వాగత సత్కారములు చేయుటకు ధనము ఖర్చుగును.
5. నీచ నవాంశలోనున్న వ్యవసాయము కొరకు ధనవ్యయము చేయును.

6. పాపషడ్వర్గులో నున్న అశుభకార్యముల కొరకు ధన వ్యయము చేయును.
7. మిత్రరాశిలోనున్న తినుటకు త్రాగుటకు వ్యయము చేయును.
8. మిత్ర నవాంశలోనున్న మద్యపానము చేయుట వలన ధన వ్యయము చేయును.
9. వర్గోత్తమములోనున్న భూసంబంధ కార్యములకు ధన వ్యయము చేయును.
10. శత్రురాశిలోనున్న చర్మరోగాదుల చికిత్స కొరకు ధనవ్యయము చేయును.
11. శత్రునవాంశలోనున్న గృహసంబంధ వస్తువులకు వ్యయము చేయును.
12. స్వరాశిలోనున్న జాతకుడు విలాస కార్యములకు ధనవ్యయము చేయును.

**ద్వాదశభావగత శని ఫలము :-**

**నృపసజ్గాత్ నీచమిత్ర సజ్గాద్ బాన్ధవ దోషత:**
**అన్త్యజాదరితో దు:ఖం జనబన్ధన సమ్భవ: 15**
**మిత్రవైరాత్ పుత్రదాసదోషాద్ దు:ఖాత్ కృపావశాత్**
**లోకదోషాత్ ప్రియసజ్గాత్ శనౌ వ్యయగతేవ్యయ: 16**

1. శని ఉచ్చరాశిలో ద్వాదశభావములో నున్న జాతకుడు రాజసాంగత్యము వలన ధన వ్యయము చేయును.
2. ఉచ్చనవాంశలో నున్న నీచమిత్రులతో కూడియుండుట వలన ధనవ్యయము మగును.
3. శుభషడ్వర్గులో నున్న అనుచిత కార్యముల వలన ధనవ్యయమగును.
4. నీచరాశిలోనున్న అంత్యజుల కొరకు ధనవ్యయమగును.
5. నీచ నవాంశలోనున్న శత్రువుల నుండి కలుగు దు:ఖము నుండి నివారణ కలుగుటకు ధనవ్యయమగును.
6. పాపషడ్వర్గులో నున్న జనులబంధమునుండి బయటపడుటకు ధనవ్యయమగును.
7. మిత్రరాశిలోనున్న మిత్రునితో వైరము వలన ధనవ్యయమగును.
8. మిత్ర నవాంశలోనున్న పుత్రుల దాసుల దోషములను నివారణ చేయుటకు ధనవ్యయమగును.
9. వర్గోత్తమములోనున్న దు:ఖ నివారణకొరకు ధనవ్యయమగును.
10. శత్రురాశిలోనున్న జాతకుడు ఇతరులపై దయాభావము కలిగియుండుట వలన వారికొరకు ధనము ఖర్చు చేయును.
11. శత్రునవాంశలోనున్న ఇతరులు చేయు తప్పులను నివారణ చేయుటకు ధనవ్యయ మగును.
12. స్వరాశిలోనున్న ప్రియమైన వారితో కూడియుండుట వలన జాతకునికి ధనము వ్యయమగును.

## ద్వాదశ భావగత గ్రహ ఫలచక్రము ( వ్యయము )

| గ్రహముల ద్వాదశ స్థితి | రవి | చంద్రుడు | కుజుడు | బుధుడు | గురువు | శుక్రుడు | శని |
|---|---|---|---|---|---|---|---|
| స్వోచ్చ | గురు జనులు | ద్యూత కర్మ | విశిష్ట వ్యక్తి | గీత వాద్య | గురు జన | వ్రత | నృప సంగము |
| సోచ్చ నవాంశ | గురు సేవ | కృషి కర్మ | నీచ మిత్ర | సుగుణ జనులు | గురు సేవకులు | శాస్త్రము | నీచ మిత్రులు |
| శుభవర్గు | దేవ బ్రా హ్మణులు | ద్విజ సేవ | బాంధవ దోషము | ఉచిత ప్రసంగము | బంధు వులు | ప్రియ సంగతి | బాంధవ దోషము |
| నీచ రాశి | దుర్జ నులు | పరస్త్రీ | అంత్య జులు | వివ శము | వ్యసనము | నృపా శ్రయము | అంత్య జులు |
| నీచ నవాంశ | దుష్ట స్త్రీ | అంత్య జనులు | వ్యసనము | నీచ సంగతి | మతి భ్రమము | పద ప్రాప్తి | శత్రు జనితము |
| పాపషడ్వర్గు | అంత్య జులు | పాప కర్మ | నీచ సంగతి | సంపన్న జనులు | పుత్రులు | శుభ కార్యము | స్వజ నము |
| మిత్రరాశి | మిత్ర కార్యము | మిత్ర హేతు | మిథ్యా కార్యము | మిత్రులు | మిత్రులు | భహుభక్ష ణము | మిత్ర వైరము |
| మిత్ర నవాంశ | అను రోధము | బంధు వులు | పిత్రు కార్యము | బంధు వులు | జనులు | మద్య పానము | పుత్రులు సేవకులు |
| వర్గోత్తమం | నృపా శ్రమము | శుభ కర్మ | మిత్రులు | వ్రత పాలన | శ్రేష్ఠ లక్ష్యము | భూమి హేతు | దు:ఖము లోవ్యయం |
| నీచరాశి | వేశ్యలు | యుద్ధము | నిరో ధము | పుత్ర హేతు | ప్రతి పక్షము | రోగము | దయలో లోవ్యయం |
| నీచ నవాంశ | కులటల కొరకు | వంచనకు | చతుష్ప దము | అన్యస్త్రీ | వివా దము | పుత్రా దులు | లోక దోషము |
| స్వరాశి | భయ నివారణము | యుద్ధా దులు | కుటుంబ హేతు | భోగ విలాసము | శుభ దానము | వ్యర్థ కార్యము | ప్రియ సంగతి |

**కశ్యపజాతకములో చతుర్దశాధ్యాయము సమాప్తము**

**************

## గ్రంథకర్త పరిచయం



జ్యోతిషవిశారద - వాస్తు సమ్రాట్

# డా॥ ముదుండి విశ్వనాథరాజు

జననం : 01.11.1952

జన్మస్థలం : పాలకోడేరు (మండలం) పశ్చిమగోదావరిజిల్లా.

విద్యార్హతలు : భాషా ప్రవీణ.ఎం.ఏ.తెలుగు, హిందీ, సంస్కృతం, ఎం.ఏ జ్యోతిషం.(యూనివర్సిటీలో ప్రథములుగా ఉత్తీర్ణత) జ్యోతిర్వాస్తు డిప్లొమ, కన్నడ భాషా డిప్లొమ.

అధ్యాపకత్వం : ప॥గో॥జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలల్లో
1976 నుండి 1982 వరకు తెలుగు భాషా బోధన
(ప్రస్తుతం) నేషనల్ పోలీసు అకాడమీలో ఐ.పి.ఎస్ అధికారులకు
తెలుగు కన్నడ భాషల బోధన.
తెలుగు యూనివర్సిటీ జ్యోతిష విభాగంలో
వాస్తు, జ్యోతిషశాస్త్ర బోధన.

రచనలు : కాలేజీ విద్యార్థుల కొరకు తెలుగు వ్యాకరణం, ఇంగ్లీషు తెలుగు హిందీ భాషలలో డిక్షనరీలు, స్వబోధినులు, కన్నడ హిందీ ఇంగ్లీషు సంస్కృత భాషల అనువాదాలు మరియు వాస్తు, జ్యోతిష ముహూర్త గ్రంథములు.

అభిలాష : ప్రాచీన ఆధునిక వాస్తుల సమన్వయంతో భవన నిర్మాణ సలహాలను, జ్యోతిష శాస్త్ర ప్రయోజనాలను సామాన్యులకు కూడా అందజేయాలని.....